'భ ర్తలేవా రే—మాకు నీతీ నియమం లేవంటున్నారా!' అన్నది ఆశాప్రియ కోపంగా.

మధ్యలో అనూరాధ అందుకుంది.

'ఆయనఅభిప్రాయం, - సినిమాలోనూ, యింట్లోనూ వాళ్ళే భర్త కాకూడదని.' అని నవ్వింది.

'అంటే, తెరపై నటించినట్లు యింట్లోకూడా నటించడం జరక్కపోయినప్పుడు పేచీలొస్తాయి. అవిగాంగా వివాహం, భర్త అంతరాయాలేమో' అన్నాను

'పెండ్లిచేసుకుంటేనే, సినిమాతారపై అపవాదు లేస్తున్నారు. చేసుకోకపోతే, యింక మమ్మల్ని బ్రతకనిస్తారా!' అన్నది ఆశాప్రియ.

'చేసుకుంటేనే సంఘం వేసిన అపవాదుల్ని పరిగణించడం జరుగుతుంది. 'భర్తని పైకి, అడ్డగాపృరచిందీ అంటూరు నలుగురూను. పైగా, స్వేచ్ఛకు వ్యక్తిత్వానికి, భర్త ఆటంకం అనక తప్పదు—భర్తతోపాటు పిల్లలువొస్తారు.' అన్నాను.

'బాబోయ్! యివన్నీ వింటుంటే భయమేస్తుంది. ఇంకానయం, నేను పెండ్లిచేసుకున్నానుకాదు' అన్నది అనూరాధ.

'పెండ్లి కానివాళ్ళు కాలేదని గొప్ప,—'

ఇంకా ఆశాప్రియవాక్యం పూర్తికాకుండానే అనూరాధ లేచింది—ఎవరో కొత్తజనం వొచ్చి, చుట్టేశారు.

'నాకార్లో మిమ్మల్ని డ్రాప్‌చెయ్యమంటాను.' అన్నది అనూరాధ.

'అల్లాగే' అని లేచాను.

* * *

మూడునెలలు గడిచాయి. మరోనెలగూడా గడిచింది. ఆశాప్రియకు ఆడశిశువున్న వార్త తెలిసింది. నామకరణ మహోత్సవానికి ఆహ్వానపత్రాలొచ్చాయి. 'మా పాపాయిని దీవించండి.—'అని ఆహ్వానంపైన, పాపాయి ఫోటో వేసింది. ఆ ఫోటో చూచుకుని ఎవరిపోలికో తేల్చుకోలేక పోతున్నాను. గుంటకళ్ళనుబట్టి, వాళ్ళనాన్నపోలికే ననుకున్నాను—పుట్టగానే పోలికలుకట్టడం ఎవరితరం? ఆశాప్రియ వివాహానికి నేను బహుమానం యివ్వలేకపోయ్యాను. ఆశాప్రియ ఆవిషయం అన్నదికూడా. ఈసారేనా పాపకు ఖరీదైన బహుమానం యివ్వాలనిపించింది. కానీ, నాదగ్గర డబ్బులేదు. ఆమె నటిస్తున్న చిత్రం 'న్యూఢిల్లీ'. అంచేత వెండి 'కుతుబ్ మీనార్' యివ్వాలనున్నది. దానికి చాలా డబ్బుకావాలి. బారసాల వారంరోజుల్లోవుంది. ఏంచెయ్యను? ఓ భావం బుర్రలో ప్రవేశించింది.

సాయంత్రం అనూరాధయింటి కెళ్ళాను. ఆమె ఎనిమిదింటికి యింటికొచ్చింది.

'విన్నావా?' అన్నది ఆత్రుతగా.

'ఆ, ఆ, అందుకే వొచ్చాను' అన్నాను.

'ఏమిటీ?'

'పాపాయిని దీవించి వెళ్ళండి—' అని నవ్వాను

అనూరాధ చిత్రంగా నవ్వింది.

'అది కాదు. మావారికి వీడ్కోలువిందు యిస్తున్నాను-మీరూ వచ్చి, వీడ్కోలివ్వండి...' అని యింకా నవ్వుతోంది.

'నీ పెళ్ళి?'

'పెండ్లి కావడం, భర్తకి స్వస్తి చెప్పటం జరిగాయి'' అని, యింకా యింకా నవ్వుతోంది.

'ఎవరికీ తెలీదే' అని ఆశ్చర్యపడుతున్నాను. 'భర్త ఎవరు చెప్పారో...' అన్నది అనూరాధ.

'... ...?'

'హయగ్రీవరావుగారు, కల్పతరువు కథానాయకుడు' అంది.

'నిజం!'

నిశ్శబ్దం.

'ఎందుకు? ఎప్పుడు?'

'ఈమధ్యనే,... ఎందుకో తెలీదు, ఇద్దరికీ సరిపళ్ళేదట. విడిచిపెట్టాడట.' అన్నది.

ఆశాప్రియ విడిచిపెట్టిందా, విడిచి పెట్టబడిందా!' అని అడిగాను.

'బాబోయ్, నీవ్యాఖ్యానాలు నాకర్థం కావు. విషయం అది'

'ఇప్పు డతనేం చేస్తున్నాడు?'

'తన షేర్లు తీసుకుపోయి స్వంతంగా మరో చిత్రం తీస్తాడట. దాన్ని బుక్ చెయ్యడానికి రాయబారాలు జరుగుతున్నాయి' అన్నది. నేను తెల్లబోయాను.

'మరి బారసాలో?'

'పాప చేతికిచ్చినతర్వాత, బహుశ బాపతేలా... వం చలా...!' అన్నది.

నేను అనూరాధ పరిహాస్యం హర్షించేస్థితిలో లేను.

'నువ్వు నాకో సహాయం చెయ్యాలి. పాపకు బహుమానం యిద్దామనున్నది; కొంచెం డబ్బుసహాయం... మళ్ళీ యిచ్చివేస్తాను...' అన్నాను.

అనూరాధ వూరికే తెగనవ్వుతోంది.

'నువ్వు మళ్ళీయిస్తానంటే నమ్మను—ఐనాయిస్తాను- తీసుకో.'

నాకు అనురాధపై కోపంవచ్చింది. కాని నిగ్రహించుకొని, ఆ డబ్బుతీసుకొని వొచ్చేశాను.

* * *

'కుతుబ్ మీనార్' తీసుకొని ఆశాప్రియ యింటికి వెళ్ళాను. నేను వెళ్ళటం ఆలస్యమైంది-రాత్రి ఎనిమిదిదాటింది జనం అప్పుడే చూసి వెనక్కి తిరిగిపోతున్నారు; వో అరడజను మందిమి మిగిలాము. అనూరాధకూడా వెళ్ళిపోయింది. ఒక పెద్దమంచముపైన ఐదారుదిండ్లు అమర్చుకుని వాటికి జేర్లబడి ఆశాప్రియ కూర్చుంది. పాపాయి అందంగా అలంకరించబడిన తొట్టిలో ఉన్నది.

ఆశాప్రియలో వుత్సాహం కనబడలేదు. నీరసంగా, దిగులుగా వున్నట్లు తోచింది. పాపకేసిచూసి—

'చాలా బాగుంది,... వాళ్ళనాన్నపోలికే' అన్నాను.

ఆశాప్రియ విషాదంగా నవ్వింది.

'నిజంగానా!' అన్నది.

'చాలాభాగం ఆయనపోలికే...అవును నే విన్నది నిజమేనా?' అన్నాను.

'ఆయనపోలికే అంటే ఆయననవ్వుతేను. ఇంక పరాయి వాళ్ళేంనవ్వుతారు?'

'నిజం?'

'అంచేతే చెప్పేం.'

'ఇదిగో మీ పాపకు' అని కుతుబ్ మీనార్ బల్ల మీదపెట్టి ప్రదర్శించాను.

'చాలా బాగుంది—అయితే— నీ కెక్కడిది యింత డబ్బు?'

'డబ్బుకేం' అని తప్పించేశాను.

'చెబుదూ—'

'నా గడింపే—'

'కోతలుకొయ్యకు. నాలుగైదొందలు అవదూ!

'అయింది.'

'ఇంత ఖరీదైంది యిస్తే జనం ఏమనుకుంటారు?' అన్నది

'ఎందరెందరో బహుమతు లిచ్చారు—అందరితో పాటు నేనూను. పైగా నేనిచ్చినట్లు అందరికీ ఎందుకు తెలుస్తుంది?

'నీ సొంతడబ్బే...?'

'అన్నమాటే. అప్పుతీసుకున్నాను.'

'ఎవరిదగ్గర?'

''చెప్పాలా?''

''ఊఁ''

'అనూరాధ.'

'నన్నడిగితే నే యివ్వనూ?' అన్నది.

నాకు నవ్వూ, కోపంకూడా వచ్చాయి. తనదగ్గర డబ్బుతీసుకొని తనకే యివ్వాలిట!

పాపాయి యేడుస్తోంది. నేను లేవదీసి, ఆడించి ఆమె కిచ్చాను. పాపని ముద్దుపెట్టుకుంది నాకది చేతకాదు. తటపటాయిస్తున్నాను. పాపమొహాన్ని నామూతిమీదనొక్కింది. అందులో ఆశాప్రియను తాకినట్లయింది. సిగ్గేసింది.

'వెడతా' అన్నాను.

ఆశాప్రియ నేత్రంలో యథార్థమైన కన్నీటితడి కాంతులనీడలు ఆసమయంలో చూశాను.

'ఊఁ' అన్నదామె.

రెండుమాసాలు గడిచినతర్వాత మరికొన్ని చిత్రమైనవి జరిగాయి. ఆశాప్రియ కూతుర్ని వాళ్ళవూరు పంపించి వేసింది. 'న్యూఢిల్లీ' చిత్రం పూర్తిచేసింది. హయగ్రీవరావు అనూరాధ కలిసి తీస్తున్న 'అమరజీవి' కూడా పూర్తయింది. రెండుచిత్రాలు ఒకేసారి విడుదలయ్యాయి 'న్యూఢిల్లీ'ని అసందర్భమైన చిత్రం అని, పత్రికలన్నీ తీవ్రంగా విమర్శించాయి; ఆ పత్రికలే 'అమరజీవి' ని మెచ్చుకుని ఆకాశానికి ఎత్తేశాయి. మరొకటి జరిగింది: అనూరాధ, హయగ్రీవరావును పెండ్లిచేసుకుంది. సినిమాప్రపంచం విస్తుపోయింది.

ఆవార్తతోపాటు పత్రికలన్నీ, మరోవిచిత్రమైన వార్త ప్రకటించాయి, 'ఆశాప్రియ' సినిమాలనుండి విరమించి వాళ్లవూరు వెళ్ళిపోతుందని.

'న్యూఢిల్లీ' చిత్రంలో ఆశాప్రియ, నిజంగా గొప్పగా నటించిందనీ, అందులో ఒక కొత్త నిజాయితీ, పరిపూర్ణతా వున్నాయనీ, నేనొక్కణ్ణే అనుకున్నాను. మా 'చంచల' లో స్వయంగా 'న్యూఢిల్లీ'పై విమర్శ వ్రాసి అచ్చు కిచ్చాడు సంపాదకుడు. ఆ రాత్రి ప్రింటర్ దగ్గరనుంచి ఆ వ్యాసం లాక్కొని చదివాను. అదికూడా యితర పత్రికల వలే, తీవ్రంగా విమర్శించింది. నే నా వ్యాసాన్ని చింపేసి, ఆశాప్రియను మెచ్చుకుంటూ మరో వ్యాసం వ్రాసి, సంపాదకుడితో చెప్పకుండా, అచ్చువేయించాను. ఆ వ్యాసంలోని కొన్ని వాక్యాలు:—

'ఆశాప్రియ యితరులకోసం తన వ్యక్తిత్వాన్ని దిగమ్రింగుకొని నటించే నైజంకలది కాదు. ఆమె నిజమైనఆర్టిస్టు. తకు ఆనందంకోసం నటిస్తుంది-యితరుల మెప్పుకోసం కాదు. ఆమెజీవితం అట్లాంటిదే. ఆమె ఆంధ్ర గ్రేటాగార్బో.'

దీనికి ఫలితం: సంపాదకుడు నన్ను వుద్యోగంలోంచి తీసేశాడు.

నా కింక గడవడం కష్టం—ఇహ బిచాణా ఎత్తేసి, మావూరు పోవడానికి సిద్ధపడ్డాను. నేను వ్రాసిన వ్యాసంపడ్డ సంచిక తీసుకుని, చదివి వినిపిద్దామని ఆశాప్రియ యింటి కెళ్ళాను. ఇల్లంతా చిందరవందరగా వుంది. సామాన్లన్నీ 'పాక్' చేసి మూలగా వుంచారు కుర్చీలు, సోఫాలు హాల్లో ఒకచోట చేరేశారు. మధ్యాహ్నము రెండు దాటింది పనికుర్రాడు ఏదో సవరిస్తున్నాడు.

'అమ్మగారున్నారా ?'

'పడున్నారు.'

'ఇదంతా ఏమిటి ?'

'అమ్మగారు సాయంత్రం మొఖులుకెతుతున్నారండి.'

నేను లోపలికెళ్ళాను. అంతా నిశ్శబ్దంగావుంది. గోడమీద అద్దాలు లేవు. గడియారం టిక్ టిక్ లేదు కుక్క మొరుగుడు లేదు. వయలేట్ రంగు పట్టుచీర కట్టుకుని. నల్లటి జాకెట్ వేసుకుని ఆశాప్రియ కుర్చీలోకూర్చుని మొహాన్ని రెండు చేతుల్లోనూ దాచేసుకుని, దీర్ఘంగా ఆలోచిస్తోంది. నా అడుగుల సవ్వడికి తటాలున మొహం పైకెత్తింది.

'అబ్బ – హడలిపోయ్యాను –'

'దేముడనుకున్నారా ?'

'దేముడొస్తే హడలిపోవడం దేనికి – పైగా నాలాంటి పాపాత్ముల యిళ్ళకి దేముడొస్తాడా –' అని నవ్వింది. కాని ఆ నవ్వు కళ్ళల్లోని బరువును కదిలించలేదు.

'మీకు తెల్సా – మా కుక్క చనిపోయింది.'

'అల్లాగా – ఎప్పుడు ?'

'నిన్న.'

'ఏం ?'

'ఊరికనే.'

'అయ్యో పాపం.' అన్నాను; కాని సానుభూతి ఎట్లా ప్రకటించాలో తెలీడంలేదు.

'మీరు వెళ్ళిపోతున్నారటగా – ఆంధ్రదేశం విచారిస్తుంది.' అన్నాను. ఆశాప్రియ నవ్వింది.

'ఆంధ్రదేశానికి అనూరాధుంది! హయగ్రీవగా వున్నాడు. నువ్వున్నావు' అన్నది వెటకారంగా.

'మీకు తెలీదనుకుంటాను. మీమీద వ్యాసం వ్రాసినందుకు నన్ను ఉద్యోగంలోంచి తొలగించారు. ఇదిగో తెచ్చాను. చదవనా?'

'నా కిప్పుడవేవీ అక్కరలేదు.'

ఆమె లేచి అటూ ఇటూ పచార్లుచేస్తోంది.

'పోనీ మరొకప్పుడు చదువుకోండి.'

ఆ పత్రిక ఆమెచేతికి అందిచ్చాను. దాన్ని తీసుకుని సోఫామీదికి గిరాటెట్టి నా కళ్ళల్లోకి తీవ్రంగా చూసింది.

'నన్ను తిట్టినందుకు నీకు ఉద్యోగం లభించింది! నన్ను మెచ్చుకున్నందుకు—పోయింది.'

ఏదో జ్ఞప్తికి తెచ్చుగుని లోపలికెళ్ళి మనియార్డరు ఫారం తెచ్చింది.

'నువ్వు అనూరాధకి ఎంత బాకీ?' అన్నది.

ఫలానంత అన్నాను. బాగ్ తీసి నోట్లకట్టను బైటికితీసి పనికుర్రాడిని కేకేసి వాడికిచ్చింది. ఫారం నన్ను పూర్తి చెయ్యమంది; చేశాను. కట్టిరమ్మని కుర్రాడిని పంపింది.

'ఈ మేడ అద్దెకిస్తున్నాను; రెండొందలకు - నువ్వు వో గదిలో వుండి ఆ అద్దె అనుభవించు'

'ఉండి ఏం చెయ్యను?'

'ఎవ్వరూ చదవని వ్యాసాలు వ్రాసుకో.'

నాకు నవ్వొచ్చింది.

'అల్లా అనడం అన్యాయం. మీకు చనువెందా !' అన్నాను.

'నిజం చెప్పినవాళ్ళు బాగుపడరు' అన్నది. నాకు దాని అంతరార్థం అప్పట్లో బోధపడలేదు.

'మీరెందుకు మానెయ్యడం?'

'అసలు నే వెయ్యడం ఎందుకు?'

'పదిమంది ఆనందంకోసం అనుకుంటా.'

'మానెయ్యడం నా ఆనందంకోసరం అనుకో.'

ఆశాప్రియ మనసిప్పి మాట్లాడగలదని నే నెప్పుడూ అనుకోలేదు. ఉద్రేకంతో కంఠం తడబడింది. కళ్ళల్లో బరువు కొంచమీది నీడలా కదిలిపోయింది; జీవితంలోంచి కలలోకి మాయమవుతున్నట్లుంది.

'నన్ను చూడ్డానికి వాళ్ళూ వీళ్ళూ వొస్తారు – పోని నువ్వెళ్ళు'.

"స్టేషనుకొస్తాను."

"నేను వెళ్ళడం యివాళ కాదు, రేపు" అన్నది

నేనొచ్చేశాను.

* * *

ఆ మొన్నాడు సాయంకాలం స్టేషన్ కి వెళ్ళేటప్పటికి ఆలశ్యమైంది. నేను ప్లాట్ ఫారంమీదికి వెళ్ళగానే మెయిలు కదిలింది; ఆమె చూడ్డానికి వచ్చిన జనం తిరిగి వొచ్చేస్తున్నారు. వాళ్ళలో అనూరాధకూడ వుంది నన్ను చూసి

"నాకు మీరింకా నోటు తాలూకు అర్ధణా ఇవ్వాలి" అన్నది.

వెళ్ళిపోతున్న రైలు - గార్డుపెట్టె వెనుక ఎఱ్ఱదీపం మాయమైంది.

[ఇందులో వ్యక్తుల పేర్లు, చిత్రాల పేర్లు కల్పితాలే. ఏపేరైనా దేనికైనా అన్వయిస్తే అది అజ్ఞానసంపన్నుల కుతంత్రంచేత కాదు.]

# వెనకచూపు - ముందుచూపు

రచనకు పూనుకున్న స్త్రీలు రెండు అపరాధాలు చేస్తారు: పుస్తకాలసంఖ్య పెంచడం, స్త్రీలసంఖ్య తగ్గించడం. కొంత లోకజ్ఞానం, అనుభవం, ఊహ, తార్కికశక్తి - యివీ రచనకు కావల్సిన పరికరాలు. ఇవన్నీ స్త్రీలకి లేకపో లేదు. మానసికంగా, భౌతికంగా మనకంటె తక్కువగా కన బడేవారిపట్ల ఆదరాభిమానాలు, సానుభూతి చూపగలం; మనకంటే అధికులైనవారిపట్ల అసూయచూపడం సహజం. అందుచేత మానసికంగా సమానులైన స్త్రీపురుషులమధ్య ఆకర్షణ సన్నగిలుతుంది. పురుషుల ఆకర్షణ, మెప్పు సంపా దించడంకోసం యిన్నాళ్ళు స్త్రీలు అబలలుగా, అమాయ కులుగా నటిస్తూ, ఆరాధించబడుతూ, శీలానికి, సహనానికీ, ఏకాగ్రతకీ పేరుబడ్డారు. ఈలక్షణాలు పురుషుడు అన్వేషించే ఆదర్శంగా ప్రపంచచరిత్రలో స్థిరపడినాయి.

రచనద్వారా కొందరు పురుషులు తమ ఆధిక్యతని ప్రకటించుకుంటూ వొచ్చారు. ఈ రంగంలో స్త్రీలు పోటీ పడితే, పురుషుడు హర్షించడు అని తెలుసుగుని స్త్రీలు రచ నకి పూనుకోవడంలేదనుకుంటాను. రచయిత్రి అనగానే పురుషుడికి వేళాకోళంగా వుంటోంది. రచయిత్రిని మెచ్చు కోడంలోకూడా తమ ఆధిక్యతని ప్రకటించుకుంటున్నారు మొగాళ్ళు.

అందుకనే నేను రచనకి పూనుకోలేను. మా వారికి చదివే అలవాటు లేదు. వారు ఏ యే సమయంలో ఏ యే ఆలోచనలు సాగించేదీ నాకు తెలుసు. కాని తెలియనట్లు కనబడతారు. వారూ అంతే. నా ఆలోచనలన్నీ వారికి బాగా తెలుసు. కాని తెలియనట్లు కనబడతారు. మా అన్యోన్యానికి యిదొక కారణం అనుకుంటూ, వివాహంనెగ్గాలంటే యీరకం నటన కాస్తంత అవసరమేమో! విడివిడిగా పుట్టాం; విడివిడిగా వెళ్ళిపోతాం అవతలవారి వ్యక్తిత్వాన్ని కుతూహలంతో కెలికి, మడ్డిచేసి పిల్లఅలన్ని లేవదీసి దూరంగావున్న ఆ రాతి మీద వాటితలలు పగులకొట్టుకుని గాయపడేటట్లు చెయ్యటం ఎందుకు? మళ్ళా ఆ గాయాలకి స్త్రీలే కట్లు కట్టాలి!

అంతమాత్రం చేత వ్యక్తిగతమైన అనుభవాలు లేవని కాదు. మరొకరితో - ముఖ్యంగా పురుషులతో - పంచుకోడానికి వీల్లేని అనుభవాలుంటాయి. అల్లాగే పురుషులకీను. ఇప్పుడల్లాంటి వొకనుభవంగురించి చెప్తాను.

మావారి తాలూకు వొకతనికి పెండ్లిసంబంధం వొచ్చింది. పిల్లనుచూడ్డానికి మావారు నన్ను వెళ్ళమన్నారు. ఆ వుదయం ఎక్స్‌ప్రెస్‌లో బెజవాడ ప్రయాణం. సెంట్రల్ స్టేషన్‌కివొచ్చేటప్పటికి ఎనిమిదైంది. ఫస్టుక్లాసులో ప్రయాణం చేసే హోదావున్నా, స్వంతపనులమీద వెళ్ళినప్పుడల్లా మేం సెకండ్‌క్లాసులో వెళ్ళటంమామూలు ఫస్టుక్లాసులోవ్యక్తులు వుద్యోగరీత్యా పెద్దలైనా పిన్నలైనా, రైలుపెట్టెలోకి ఎక్కగానే అదొకలాగైపోతారు. ఎవరితోనూ మాట్లాడను. ఏదో చదువుకుంటూ, దీర్ఘంగా ఆలోచిస్తూ, లైట్లు, ఫ్యాన్లు, కిటి

కీల విషయంలో తమ హక్కులు కాపాడుకుంటూ దాబుగా ప్రవర్తిస్తారు. అది చూచి అవతలవారుకూడా మరెంత దాబుగా వ్యవహరిస్తారు. సెకండ్ క్లాసులో బోలెడంత కాలక్షేపం. ఇందులో ప్రయాణంచేసేవారు కొత్తసంస్కారంగలమధ్య తరగతివారు వారి సంభాషణలు వింటూంటే లోకంపోకడ, వ్యక్తుల వింత మనస్తత్వాలు తెలుస్తాయి, కాలక్షేపం అవుతుంది. మూడోతరగతి మరీ గంద్రగోళంగా వుంటుంది! వుమ్ములు, చిరుతిండ్లు, తిట్లు, తుమ్ములు. దగ్గులు - పచ్చి పచ్చిగా అర్థం తెచ్చుకోని వాస్తవికజీవితానికి నకలు. రెండో తరగతిలో ప్రపంచానికి కళకి చిహ్నమైన లయ, క్రమం వున్నాయి. ప్రజాసామ్యసిద్ధాంతం రెండోతరగతిలో వ్యక్తమైనట్లు మరెక్కడా కాదేమో!

మా నౌకరు రాయన్న సరంజామాతో మాపెట్టెదగ్గర లోవున్న మూడోతరగతిలో సర్దుకున్నాడు. ఓ అమ్మాయిని కూడా ఆ పెట్టెలో కెక్కించాను. పిల్లాడినెత్తుకున్న ఆమెని సరిగ్గా చూడలేదు.

'మా చెల్లెలండీ- తెనాలెడుతూంది.' నాకు నవ్వొచ్చింది. రాయన్నకూడా యీ ప్రయాణం పేరిటస్వంతపనులు చూసుకుంటున్నాడు. మావారూ, నేనూ రెండోతరగతి పెట్టెలో ఎక్కాం. పెట్టెనిండా జనంవున్నా, వారిలో చాలా మంది వీడ్కోలివ్వడానికి వచ్చినవారేగనుక, కొందరు లేచి నాకు జాగా చూపారు. హోల్డాల్ సగం విప్పి మావారు కూర్చోమన్నారు. మావారికి వ్యవసాయశాఖలో పెద్ద వుద్యోగం. ఆయనతోబాటు కొందరు స్నేహితులూ, వుద్యో

గులు స్టేషన్‌కొచ్చారు. ప్లాట్‌ఫారంమీద నిలబడి మాట్లాడు
కుంటున్నారు. ఇంతలో గార్డ్ విజిల్ వేశాడు. కలకలం బైలు
దేరింది. తెచ్చిపెట్టుకుని దొక్కున్నట్లు ఎంజిన్ కూసింది.

'ఎల్లుండికి వ్యాసం మెయిలుకి రాయమన్నారని పంపు నా
కక్కడ పనితగిలింది. ఇద్దరం కలిసేద్దాం' అన్నారు మా
వారు. రైలు కదిలింది. కాళ్ళు చేతులు, బుజాలరాపిడి, తలు
పులు వేయడం, అత్తరుపరిమళం, బొగ్గువాసన, చేతిరుమాళ్ళు
వూపడం, కిటికీలనుంచి సగంసగం కనబడే వ్యక్తులు, దూరమై
పోతున్న ప్లాట్‌ఫారం, పరిచయమైన ప్రపంచంతో సంబంధం
తెగినట్లు, పట్టుమార్చిన కుదుపు, పాతవూహాల్ని, జ్ఞాపకా
లని చెదరగొట్టే రైలువడి - యివన్నీ నన్ను ఏకాంతమైన
వూహాప్రపంచంలోకి చేర్చాయి.

రైలు నడిచే క్రమానికి మన ఆలోచనలు, భావాలు,
వాంఛలు వొకక్రమాన్ని పొందుతాయి. వ్యక్తిత్వానికివొక
ఆకృతి ఏర్పడుతుంది. మన మెదడూ, మనస్సులో చీకటి
గుహాలు, వాటిల్లో మనం శీలంవేసిన నాగడా. ఆద్యంతాలు-
అన్నీ అద్దంలో చూసుకున్నట్లు విస్ఫుటమౌతాయి. ఆ కద
లికలో నిజస్వరూపం బైటపడుతుంది. దాన్ని మెచ్చుకోలేం,
తిట్టలేం. ఆశ్చర్యంతో స్తంభించిపోతాం. ఈ స్థితి నిద్రలోకి
జారుతుంది.

రైలు నిలిచింది. ముందుకు వొంగి చూశా ఇంకా
సిగ్నలివ్వలేదు. ఏవో మరమ్మత్తులు జరుగుతున్నాయి. పని
చేస్తున్న కూలీల కండలమీది చెమటని సూర్యరశ్మి వెలిగి
స్తోంది. వారి శరీరాలు రైలుపట్టాల ముక్కలు, ఆ మధ్య

మావా రెండులోనో వొక వ్యాసం చదివాను- ప్రపంచంలో ఇనుమంతా తగిరిపోతోందిట. మరో లోహం కనుక్కుంటే తప్ప పారిశ్రామికయుగానికి భవిష్యత్తు లేదట. ఆనాడు యీ కూలీల శరీరాలమీదనే రైలు ప్రయాణం కాబోలు! అట్లాంటి శరీరాలు వారివి. వారిశ్రేయస్సుకోసమే ప్రభుత్వాల కృషి. కాయకష్టంతో నిమిత్తంలేక నాజూకుతో నీరసించిన మన లాంటి శరీరాలు అందరూ పెంచుకున్ననాడు. రైళ్లెలా నెడతాయో నే నూహించలేను.

రైలు కదిలింది. పెట్టెలో జనంకేసి వొక్కసారి చూచాను. రెండుకాళ్ళూ కిటికీ కానించి వొంగి పడుకున్న పిల్లాడిని మినహాయించి పదముగ్గురున్నారు. ముగ్గురు పైన పరున్నారు. నలుగురు కూర్చునే నిద్రపోతున్నారు. ఎదురుగుండా వో బట్టతలాయన పత్రిక చదువుకుంటున్నాడు. కళ్ళజోడు నడివయస్కుడు. సినిమాపత్రిక చదువుతున్నాడు. మరోయిద్దరు లాల్చీవ్యక్తులు మెల్లగా మాట్లాడుకుంటున్నారు. కిటికీలోంచి మాటిమాటికీ వూస్తూ నోముసిలాయన చుట్టకాలుస్తూ కూర్చున్నాడు. ఆయనపక్కన వొకామె నాకేసిచూస్తూ, నే చూసినప్పుడు చూపు తప్పించివేస్తూ చేతిగాజులుసవరించుకుంటూ. గాలికిరేగుతున్న ముంగురులను వెనక్కితోస్తూ కాలక్షేపం చేస్తూవుంది. జుట్టుకి నూనిదట్టంగా పట్టించింది. కాని ముందుభాగం, పాపిడ యిరువెంప్రలా వున్న ముంగురులకు నూనెరాయలే దనుకుంటా. అవి బూడిదరంగు వెంట్రుకలు వొంకరలుతిరిగి, పడుతూ లేస్తూ అవి ఆ మొహానికి కొంతఆకర్షణ ఆపాదించాయనుకుంటాను

పల్చటి పెదవులు, నరసతప్పిన వొక పన్ను, చాయనచాయ-పాతికలోపు కలాశాల విద్యార్థినేమో నాకు తెలియదు.

ఆ వ్యక్తులవేషం, మాట తెరువునిబట్టి ఎవరెవరు ఏయే వృత్తులలో వుండివుంటారో వూహించుకోనడం తమాషాగా వుంటుంది. రైలు నిలిచింది - ఊహ నిలిచిపోయింది. గూడూరు, జనం దిగడం, ఎక్కడం, బెడ్డింగులు, పెట్టెలు, సంచుల గిరవాట్లు, సామాన్లతో దిగుతున్న కూలీలవాసన— కాసేపు మళ్ళా ఎరుగున్న ప్రపంచంలో కాలుపెట్టినట్లయింది. నా కేమన్నా కావాలేమో కనుక్కునేటందుకు నచ్చాడు రాయన్న. ఏమీ అక్కర్లేదన్నాను నే కూర్చున్న వెంపుకు ప్లాట్‌ఫారం దూరం దోవలో మొగాళ్ళు నిలబడి వున్నారు. స్టేషన్‌లోవున్న వ్యక్తులు కనబడడం లేదు. రాయన్న మొహాన్నికూడా కిటికిలోంచీ, తలలమధ్యనుంచీ కాస్తంత చూడగలిగా. పైనున్న ముగ్గురు దిగి వెళ్ళారు. బట్టతలాయన కళ్ళజోడు తీసి అదిపెట్టే పెట్టెకోసం వెదకడం మొదలెట్టాడు జేబులుచూశాడు; పెట్టెలకిందా, పైనా సీటు కిందా చూశాడు. పేపరుకింద చూశాడు. ఎక్కడా లేదు.

నాకు నవ్వొచ్చింది.

'మీరు లేవండి' అన్నాను.

ఆయన లేచాడు. అక్కడేవుంది కండ్లజోడు కేస్. ఆయన నవ్వుకొని జోడు అందులో పెట్టుకొని, అటూ యిటూ చూస్తున్నాడు. నే అనుకున్నట్లుగానే ఆయన రిటైరైన కాలేజీ ప్రిన్సిపాలట. పేరు అవధానిగారు. అల్లుడిదగ్గరికి నాగపూర్ వెళుతున్నారట. మావార్ని ఎరుగుదురట.

ఆయన రిటైరై ఇల్లుకట్టుకొని తోట వేసుకున్నారట. ఆతోట విషయంలో మావారు మంచి సలహాలిచ్చారట.

'మిమ్మల్నిచూడలేదు. నేను తిరిగొచ్చింతర్వాత మీరిద్దరూ మాయింటికొచ్చి, మా తోట చూడాలి. ఈమాటు మా అమ్మాయినికూడా తీసుకొస్తాను' అన్నారాయన. కూతురు, అల్లుడు, వారి వుద్యోగం,నాగపూర్‌లోఆంధ్రులు-అల్లా మాట్లాడుతూ వున్నారు. ఇంతలో రైలు కదిలింది. జనం కొత్త స్థలాలలో సర్దుకుంటున్నారు. ఇద్దరు ముగ్గురు కొత్త వ్యక్తులున్నారు. వారిలో వొకాయన మూలగా జరిగి కూర్చున్నాడు. కాకిలాగు, లోపల బెల్టుతో బిగించినచొక్కా మెడచుట్టూ 'స్కార్ఫ్,' పక్కన చిన్న లెదర్‌బాగ్ వున్నాయి. చేతికి రిస్టువాచీ వుంది. కిటికీలో రెండు చేతులూ వాల్చి వాటిమీద గడ్డం ఆనించుకొని బైటకి చూస్తూ కూర్చున్నాడు. ముప్ఫైలోపువయస్సు. సన్నటివడుం, తీర్చిన కనుబొమ్మలు. నున్నటినుదురు, చెక్కిళ్ళు, మధ్యపాపిడి, వుంగరాలజుట్టు. నున్నగాచేసుకున్న గడ్డం గుర్తు, లేత ఆకు పచ్చగా మెరుస్తోంది; ఆపెట్టెలో వున్నవారిలో కళైన మొహం—నిదానంగా చూస్తే ఆకర్షణీయంగా కనబడ్డాడు. పెండ్లియిందా? అవకుండా వుంటుందా?

'మీకు పిల్లలా ...?'

అదరిపడ్డాను. అవధానిగారు మళ్లా ప్రశ్నించారు. లేరని చెప్పాను. చాలామంది మొహాలు నావెంపుతిరిగాయి. నాకు సిగ్గేసింది. కిటికీలోంచి జారిపోతున్న పొలాలని, చెట్లని, గట్లని చూస్తూ కూర్చున్నాను. అవధానిగారు తనకూతురు

విషయం చెప్పడం సాగించాను. చాలా కాలం ఆమెకు పిల్లలు కలగ లేదట. ఆపరేషన్ చేయించారట.

అవధానిగారిసంభాషణలో వొక విశేషం వుంది. అదొక స్వగతంలాంటిది. మన మేమీ ప్రశ్నలు వేయనక్కర లేదు. వింటూన్నట్లు ఆయన కేమీ నిదర్శనా లక్కరలేదు. మన స్వంత ఆలోచనలు భంగంలేకుండా సాగించుకోవచ్చు.

కదలికలో ఆలోచనలు, భావాలు వికాసంచెందుతా యెందుకో! ఎన్నాళ్ళో అర్థంకానివి, అర్థమవసాగుతాయి. కొన్ని సందేహాలుకూడా తేలిపోతాయి. 'నిన్ను సాయంత్రం సభకు ఆహ్వానించింది రాజయ్యా, ఆయనభార్యా?' అని మా వారు, ఏడాదిక్రితం అడిగిన ప్రశ్నలో ప్రాశస్త్యం యిప్పుడు బోధపడింది. బేసిక్ స్కూలు విద్యార్థుల తోటపెంపకం పోటీ బహుమతులు యివ్వవలసిందిగా, వున్నతోద్యోగి రాజయ్య నన్ను ఆహ్వానించాడు. అదంతా అయినవారంరోజులకి మా వారు యీ ప్రశ్న అడిగారు. ఎవ రాహ్వానిస్తే నేం?

కారణం యిప్పుడు తెలిసింది - పిలవడానికి రాజయ్య భార్య మాయింటికి వొచ్చివుంటే, మావాళ్ని చూడ్డానికి వచ్చిందని వారికి స్ఫురించివుండునేమో! నాకు తెలియని ప్రేమకలాపాలు వారి కేమీలేవు—అని అనుకుంటున్నాను. అయినా నలభయ్యోపడిలోపడిన నడివయస్కులు స్త్రీలచే ఆకర్షింపబడే అనుభవం వొదులుకోరనుకుంటా. ఈ అభిప్రాయాన్ని పురుషులు ఖండిస్తే, స్త్రీహృదయం ఎంత రహస్య మైనదో, పురుషుడిహృదయమూ అంత రహస్యమైనదే నన్న నిర్వచనానికి ఆక్షేపణ వుండనక్కర్లేదు.

'మీరే కాలేజీలో చదువుకున్నారు?' అవధానిగారి ప్రశ్నకి ఆశ్చర్యపడ్డాను. నేను కాలేజీలో చదివిన విషయం ఆయన కెట్లా తెలుసు? నా ప్రక్కనున్న ఇంగ్లీషుపత్రికసుబట్టా? ఫలానా అని చెప్పాను. పెట్టెలో వ్యక్తులందరూ నా వైపు చూశారు—నాక్కూ ఆమూలనున్న వ్యక్తితప్ప. అతనిప్రక్కన వున్న బాగ్ మీద టి. కె. అక్షరాలున్నాయి. 'కె' అంటె కుటుంబరావనుకొని ఆ పేరుతో వ్యవహరిస్తాను.

'జ్ఞాపకంవొచ్చింది. ఏదోమాటల్లో మీ విషయం వొచ్చింది. చరిత్రలో మొదటితరగతిలో ప్యాసైనారట— మీరావా రన్నారు.' నే నేమీ అనలేదు.

'ఏమిటో ఈరోజుల్లో స్త్రీలు పెద్దచదువులు చదువు తున్నారన్నమాటేగాని, ఎందుకూ వుపయోగపడడం లేదుస్మాండి. అందుకనే మాఅమ్మాయిని చదువుమాన్పించి పెండ్లిచేసేశాను. పెద్దచదువులు చదివి ఎదిగిన పిల్లకి మనం పెండ్లిండ్లుచేయలేం. వారంతవారే ఎవర్నో ఎన్నుకోవాలి. చదువుకున్న స్త్రీలకి ఎందువల్లనో యీ రోజుల్లో వివాహాలు కావడంలేదు. ప్రేమించి చేసుకున్నా పెళ్ళిళ్ళు నెగ్గుతున్నా యంటారా?'

నాకు సమాధానం చెప్పాలనుంది—కోపాన్నుండి బైలుదేరిన సమాధానం—అందుకనే చెప్పలేదు.

'నెగ్గడమంటే?' అన్నాడు లాల్చీవ్యక్తి.

'విడాకులిచ్చుకోకపోవడం అని వారభిప్రాయం' అన్నాడు చుట్టకాలుస్తున్న పెద్దాయన.

'ఏమండీ—అంతేనా?' అని నాకేసి చూశాడు.

'లోలోన కుళ్ళి కలిసుండడం బదులు విడిపోవడం మంచిది కాదంటారా?' అన్నాను.

'మరి పిల్లలేమవుతారు?' అన్నారు అవధానిగారు.

'ఎవరు పోషించగలిగితే వాళ్ళతో వుంటారు. పోషించే శక్తి యిద్దరికీ లేకపోతే ప్రభుత్వం భరించాలి.'

'పూర్వకాలం పెండ్లిండ్ల కంటె యీ చదువుకొని ప్రేమించుకున్న పెండ్లిండ్లే మంచివంటారా?' అన్నాడు ముసలాయన. ఆ ప్రశ్నల్లో వెటకారం వుందని నాకు తెలుసు. నా సమాధానం కూడా అల్లానే వుంటుంది – ఎంత స్థిమితంగా చెప్పినా.

చదువుకున్నవాళ్ళేగాని, చదువురానివాళ్ళు ప్రేమించుకోలేరని నేననను. ఓవిధంగా వారిలోనే వుద్రేకాలు తీవ్రంగా వుంటాయనుకుంటాను. చదువు, నాగరికత వుద్రేకాన్ని చంపుతాయి. ఎటొచ్చీ ఏదోవిధంగా జీవించడం వొకటీ, మనం కోరినట్లుగా అందంగా, ఆనందంగా, కొన్ని ఆదర్శాలను సాధించామన్న జిజ్ఞాసతో జీవించడం మరొకటీ. ప్రేమవివాహంలో నైతికచింతనకి తావుంది. దాంపత్యం కొనసాగకపోతే యితరులను నిందించేటందుకు వీల్లేదు. ఎవరి కార్యాలకి వారు బాధ్యులవుతారు. ఈ బాధ్యత అన్యోన్యాన్ని పెంచుతుందికాని, కూలదొయ్యదు.

నేనిల్లా మాట్లాడుతుంటే నాకంఠం నాకే వింతగా ధ్వనిస్తోంది. నా ధైర్యానికి ఆశ్చర్యపడ్డాను. భావాలు, పదాలు నాకు కొత్తవి కావు ఎన్నోమార్లు స్నేహితులతో జరిపిన చర్చలలో వాడకంవల్ల అలవాటైనవే. అందరి

చూపులూ నామీద పడినవి. చుట్టూ చీకటి – మధ్య వెలుగు ఆ వెలుగులో వేదికపైన నేను తరతరాలుగా మూగజీవులైన ఎందరో స్త్రీలవ్యక్తిత్వాలు నాలో క్షణం ఆకృతిపొంది వాదానికి పురిగొల్పాయి. మావారు వుండివుంటే యిల్లా అనగలనా? – అంటే యితరులుండగా మావారు కూడా వున్నప్పుడన్నమాట. 'వయస్సులో చాలా చిన్నవారైనా అనుభవం చాలా గడించారు' అన్నారు అవధానిగారు. అది నన్ను సంతృప్తిపరచడంకోసం అన్నమాట. ఇతరులు మనం చిన్నవాళ్ళల్లాగా కనబడుతున్నా మన్నప్పుడు, మనం పెద్ద వాళ్ళమైపోతున్నామని తెల్సుకోవచ్చు ననుకుంటా.

'దీనికి అనుభవం దేనికండీ – మీబోటి పెద్దలు అంటున్నమాటలే' అనేశాను. ఇంతలో రైలాగింది. జనం భోజనాలకికాబోలు దిగుతున్నారు. కొత్తగా ఒకలావాటామె ఎక్కింది. రాయన్న కారియర్లో భోజనం తీసుకొచ్చాడు. తిని, అంతా శుభ్రంచేసుకుని పక్కపరచి ఓరగిలిపరున్నాను.

నాలో విషయం కూతూహాలాన్ని రెచ్చగొట్టింది. మా సంభాషణ బిగ్గరగా సాగుతోంది. అందరూ నాకేసిచూశారు. ఒక్క ఆ మూలనున్నవ్యక్తి – కుటుంబరావు తప్ప.

భోజనంచేసి, తాంబూలంవేసుకుని పెదవులు ఎర్ర బడుచుకుంటూ, కుటుంబరావు పెట్టెలోకెక్కి మూలనున్న తనస్థానంలో కూర్చుని, మళ్ళా బైటికి – శూన్యంలోకి – చూస్తున్నాడు. లోపలిజనంలో వొక్కరికేసి చూడలేదు. నేనంటే పల్చగా ఏదో మూలగా వొదిగిపరున్నాను. ప్రక్కన లావాటామెను చూడొచ్చుగా. అంధుడా! ఒక్కడు వెళ్ళ

భోజనం చేసివొచ్చాడే - అంటూ ఇటూ పడకుంటా, కళ్ళు రెప్పలు, మూసుకుంటూ తెరుచుకుంటూ, చైనాబొమ్మలా - అంగవైకల్యం కనపడదు.

యౌవనంలో అనుభవంకోసం తహతహలాడటం సహజమంటారు పెద్దలు. అతను యువకుడు. కొత్తవ్యక్తులను కలుసుకోవాలనీ, వారితో మాట్లాడాలనీ వుండాలి; పరిసరాలని అవగాహనచేసుకోవాలనీ, కొత్తవిషయాలను గ్రహించాలనీ వుండాలి; స్త్రీలపట్ల ఎంత కుతూహలం కనబరచాలి! నే నంతసేపు మాట్లాడానే, ఎవరీవ్యక్తి అన్న కుతూహలం చూపడే! నేను చాలా చక్కనిదాన్నిగనక నన్నంతా చూసి మెచ్చుకోవాలి అనడంలేదు. యౌవనం యౌవనాన్ని పిలుస్తుందంటారు; అవధానిగారు నేను చిన్నదాన్నని అభినందించారు; ముఖ్యంగా స్త్రీని, స్త్రీ వునికిని గుర్తించకపోవడం స్త్రీజాతిపట్ల అపచారం. చరిత్రలో రాకొమరితలు, వారి పరిచారికలు 'ఇంతేనా మీకాలంలో - శృంగారమే లేదా ? స్త్రీపురుష ఆకర్షణ లేదా! ఆ తేడాలే లేవా - ఇంతేనా...' అని చేసిన విషాదగానం నా చెవులో వినబడుతోంది.

కనురెప్పలు సన్నగా విప్పి అతనివైపు కోపంగా చూశాను. ఎల్లోరాలో శిథిలశిల్పాలకేసి నెత్తికొట్టుకోడంలా గుంది. ఆ శిల్పాలలో పురుష విగ్రహాలు ఎంత నిండైనవి, ఎంత అందమైనవి! ఈనాడు ఆ శిల్పులు లేరు - అట్లాంటి వాస్తువూ లేదు. సుందరమైన స్త్రీల ప్రేమాదరణలు లేకపోతే ఆ అనామకులైన శిల్పులు అంతటి అందమైనవిగ్రహాలను చెక్కివుందురా !

అతనిలో జీవితంపట్ల, తృష్ణ సున్న. శరీరంలో కొన్ని ద్రావకాలు లోపించివుంటాయి. అట్లాంటివారికి వాంఛ లుండవు. అది ఆధ్యాత్మికచిహ్నం అంటే నమ్మను. మహా ఋషులు సాధించిన ఆధ్యాత్మికానుభూతి వెనక నైతికబలం, దీక్ష, నిబ్బరం వుంటాయి. శక్తులున్నవారికే నిగ్రహం సాధ్యం.

ఇతను యోగేమిటి నా తలకాయ! సాధారణవ్యక్తి-జ్ఞానహీనుడు - అల్పుడు. లాటరీలో వచ్చిన గడియారం ప్రదర్శిస్తున్నాడు. దానికేసి చూసే అవసరం లే దతనికి.

కుర్రాడు ఏదో తింటూ, బంతిఆడించుకుంటూ వొచ్చి కూర్చున్నాడు. రబ్బరుబంతి, దానికో రబ్బరు తాడు. వేళ్ళల్లో తాటిని బిగించి బంతిని దూరంగా విడిచి దగ్గరకు లాక్కుంటున్నాడు. తాడు తెగి బంతి అవతలవైపు కుటుంబరావుకాళ్ళకింద పడింది.కుర్రాడు వెదుకుతున్నాడు.

'అక్కడ - ఆమూల కూర్చున్నాయన కాళ్ళకింద' అని కుర్రాడికి అటుకేసి చూపించాను. కుర్రాడు అటువెళ్ళి వొంగాడు ఆ వ్యక్తి కాళ్ళు పైకితీసుకున్నాడు ఎవరికేసి చూడకుండా. కుర్రాడు బంతి తీసుకొచ్చాడు.

నాకు వొళ్ళుమండింది. నా మాట విన్నాడు. ఇటు కేసి చూడొచ్చుగా. గర్వమా ? ఈ అల్పుడితో నాకేమిటని కళ్ళుమూసుకుని పడున్నాను.

రైలు కదిలింది. రాయున్న మొహం కిటికీలోంచి కన బడి వెనక్కి కదిలింది. మధ్యాహ్నపుటెండ నా నుదిటి మీదికి జారింది. దుమ్ము, బొగ్గుకణాలు ఎండలో కదులుతూ,

చిరాకు కలిగిస్తున్నాయి. చీరకొంగు జుట్టుమీదినుంచి బిగించి నుదుటిమీద కప్పుకున్నాను. పెట్టెలో అలజడి లేదు. కొందరు జోగుతున్నారు. కొందరు శూన్యంలోకి చూస్తున్నారు. కుర్రాడుమాత్రం బంతిని టపీటపీ నేలమీద కొడుతున్నాడు. కుటుంబరావు సిగరెట్టు కాలుస్తున్నాడు - అవతలికి చూస్తూ చౌకరకం సిగరెట్టు. కళ్ళుమూసుకున్నాను. జ్ఞాపకాలు రైలు కదలిక లయలో కలిసిపోయాయి. ఎంతసేపయిందో తెలీదు, నిద్రపోయ్యానేమో!

రైలు వొక్కకుదుపుతో నిలిచింది. లావాటామె నా మీద పడింది. లేచికూర్చున్నాను కుర్రాడునవ్వుతున్నాడు. కుదుపుకి అవధానిగారుకూడా లేచాడు. సామాను సర్దుకుంటు న్నాడు.

'ఇంకా స్టేషన్ రాలేదు, రెక్క వాల్లేదు' అన్నాను.

'కళ్ళజోడు కేస్ కనిపించడంలేదు' అన్నాడు అవధానిగారు.

'కథలలో చెప్పుకునే మతిమరుపుఅయ్యవారిలా వుండండోయ్ మీ కథ' అన్నాను. ఆయన నవ్వాడు.

'మరి నేను అయ్యవార్నేగా. ఇంతకీ జోడు...'

'మీకళ్ళకి తగిలించిలేదుకదండి - వొక్కసారి తడవండి'

తడిచాను. దుప్పటికింద వుంది.

'ఏమిటబ్బా గుచ్చుకుంటోంది అని గంటనించి ఆలోచిస్తున్నా - తాళంచెవా? పర్సా? పౌడుంకాయా?...' నవ్వుకున్నాడు.

ఒక ప్రొఫెసర్‌గారు పరీక్ష చేయించుకోడానికి డాక్టర్ దగ్గరికి వెళ్ళాడుట. నాలిక చాచమన్నాడుట డాక్టర్. చాచాడుట. దానిమీద రెండణాల స్టాంప్ అంటుకుని వుందట. 'ఇక్కడుందా స్టాంప్! ప్రొద్దున్నుంచీ వెదుకుతున్నా' అన్నాడట.

పెట్టెలోజనం నవ్వారు- మూలనున్న కుటుంబరావు తప్ప.

ఇంతలో ముసిలాయన చుట్ట నోట్లో పెట్టి, అగ్గిపెట్టి తీసిచూశాడు పుల్లలు లేవు. అటూయిటూ చూశాడు. ఎవ్వరూ అగ్గిపుల్ల యిచ్చినవారు లేరు. నేను మూలనున్న కుటుంబరావుకేసి చూపించాను.

'ఏమండి! అగ్గిపుల్ల యివ్వగలరా?' అన్నాడు ముసిలాయన కుటుంబరావుభుజం తడుతూ. అతను పంట్లాం జేబులోంచి తీసిచ్చాడు, యిటుకేసి చూడకుండానే. నా కర్థం కాలేదు యీవింతప్రవర్తన. మూసున్నస్థలాలంటే భయమా? మావారు చెబుతూండేవారు- వొకాయనకి మూసున్న స్థలాలంటే భయంట. తలుపులు మూసేసిన గదిలో కూర్చోలేడట. అదో మానసికజాడ్యంట.

'కుర్రాడిని నాతో తీసుకురావల్సింది - యీ వెదుకోటం తప్పేది. అందుకనే మన పూర్వీకులు పిల్లలో అని యిచ్చేది' అన్నాడు అవధానిగారు.

ఇంతలో లావాటామె అందుకుంది. ఆవిడపేరు శేషమ్మట. తమ్ముడు పోలీసు సూపరెంటట ఆమెభర్తకి పొగాకు వ్యాపారంట.

'ఎందుకొచ్చినపిల్లలు లెద్దురూ? ఆడపిల్లలైతే-పెళ్ళిళ్ళ కోసం తిరుగుళ్ళాట; మొగపిల్లలైతే- చదువులు, వుద్యోగాల కోసం దేవుళ్ళాట. పిల్లలు లేకుంటేనే స్వేచ్ఛ' అన్నది శేషమ్మ.

'ఇంకా నయం. అందరూ యీ స్వేచ్ఛకోరితే దేశ మేంగాను! అసలు సమాజమే వుండదు ఏమంటారు?' అన్నాడు అవధానిగారు నన్ను సంబోధించి.

'మరిచిపోయ్యాను. మీకు సంతానం లేదు గనుక, శేషమ్మగారి స్వేచ్ఛే నయమంటారు, అవునా?'

'నే నల్లాగనను. పోషించలేనివారికి పిల్ల లుండకూడ దంటాను. ఆర్థిక పరిస్థితినిబట్టి, కుటుంబం నిర్ణీతమవాలి. అందు కనే కుటుంబపథకం అంటూ తయారుచేసి ప్రచారంచేస్తోంది ప్రభుత్వం. మనప్రజలు మూఢాచారాలకు గుర్తు, అందు లోని సూత్రాలని ఆమోదించినా, ఆచరణలో మాత్రం పెట్టరు' అన్నాను.

నా కీ విషయం ప్రస్తావించాలని లేదు. ఎందుకో ఆ క్షణంలో ధైర్యమొచ్చింది. పిల్లలులేని స్థితిని సమర్థించుకోవ డమా! మనస్సు చిత్రమైనది. మన ప్రవర్తన నమ్మకాలను సమర్థించేటందుకు ఎన్నో కారణాలను వెదికిపెడుతుంది. అయినా అవధానిగారు పెద్దాయన. తత్వాన్నిగూర్చి చర్చ గాని, వ్యక్తిగతమైన వివాదం కాదుగా. కుటుంబపథకం గూర్చి వొక స్త్రీ మాట్లాడుతోందంటే, పురుషులు విస్తు పోవాలి. కుటుంబరావు యిటుకేసి చూడడేం? కుతూహలం కనబరచడేం?

'అవుతే, సంతాననిరోధం ప్రకృతివిరుద్ధం కాదంటారా ?' అని మళ్ళా ప్రశ్నించాడు అవధానిగారు.

'మన నాగరికత, మన వేషభాషలు, ఆచారాలు, కట్టుబొట్లు, యివన్నీ ప్రకృతివిరుద్ధం కావంటారా?' అన్నాను.

'మా బాగా అడిగావమ్మా! గంపెడు పిల్లలతో వెయ్యేళ్ళు వర్ధిల్లు' అంది శేషమ్మ.

గంపలో పిల్లల్ని వూహించి నవ్వుకున్నాను.

'అయినా యీ ప్రశ్న మిమ్మల్ని అడక్కూడదేమో తెలండి. ఇంతకీ టైమెంతయిందో' అంటూ అటూ యిటూ చూశాడు అవధానిగారు. నా చేతిగడియారం కేసి చూశాను. నా రిస్టువాచిమీద కుడిచెయ్యి ఆనించివుంది.

'నా వాచి నిలిచిపోయిందండీ' అంటూ మూలనున్న కుటుంబరావు కేసి చూపించాను.

'ఏమండీ, టైమెంతయిందండీ?' అన్నాడు అవధాని గారు, కుటుంబరావు కేసి తిరిగి. అతను వెనక్కి తిరగకుండానే తన చేతిని బైటికి తీసి, వాచిని ప్రదర్శించాడు. నాలుగు దాటింది. 'నా మతిమరపూ నేనూ – భలేవాడినే. నాకోటు జేబులో, పోకెట్ వాచీ వుండగనే వుందిస్మాండీ' అంటూ అవధానిగారు జేబులో గడియారంతీసి 'కీ' యిస్తున్నాడు.

'మతిమరుపుఅయ్యావార్ని గురించి మరో కథ వుందండోయ్. ఇద్దరు స్నేహితులు మూడో స్నేహితుణ్ణి రైలెక్కించడానికి స్టేషన్ కెళ్ళారట తీరా రైలుకదిలినతర్వాత అసలు వెళ్ళవలసినాయన ప్లాట్ ఫారమ్ పైననే దిగబడిపొయ్యాడట. ఇంకా యిక్కడే వున్నారేం అని స్టేషన్ మాస్టరడిగాడట.

'వొచ్చే రైల్లో నా స్నేహితులిద్దరు దిగుతున్నారు. వారికి స్వాగతంచెప్పడానికి కొచ్చానులెండి' అన్నాడుట'

అందరూ నవ్వారు. శేషమ్మకూడా బుజాలు ఎగుర వేసుకుంటూ నవ్వింది రైలు నిలిచింది. తెనాలిస్టేషన్. అవ ధానిగారు సెలవుతీసుకుని దిగాడు. చిల్లరసామాన్లన్నీ పొగు చేసి అవతలికి అందించాను. కుటుంబరావు తన బాగ్ తీసు కొని ఎవ్వారికేసిచూడకుండా దిగాడు. పెట్టెముందు నిలబడ్డాడు అటూ యిటూ చూశాడు పదడుగులు ముందుకు నడిచాడు. వెనక పెట్టెలోంచి చంటిపిల్ల నెత్తుకొని నడుస్తూ వొచ్చింది ఒకావిడ. ఆమె ముందువున్న బెడ్డింగు తీసుకొని కుటుంబ రావు, ఆమె గేటువెంపు నడిచిపోతున్నారు. గేటుదగ్గర జనం గుంపుగా నిలబడి ఒక్కొక్కరే టిక్కెట్ యిచ్చి లోపలికెడు తున్నారు. రాయన్న గ్లాస్కు తీసుకొని కాఫీ తీసుకొస్తానని వెళ్ళాడు. గేటుదగ్గర గుంపు పలచబడింది. ఆగుంపులోగుండా రాయన్న వెళ్ళాడు. సోడావాళ్ళు, టీవాళ్ళు నాపెట్టెముందు పోగయ్యారు. జనం లోపలికెక్కుతున్నారు, వారికి చోటివ్వ డంకోసం లోపలికొచ్చాను. కూలీలు పెట్టెలోంచి దిగారు. మళ్ళా తలుపుదగ్గరకు వెళ్ళి గేటుదగ్గర జనంకేసి చూస్తూ నిలబడ్డాను రాయన్న హోటల్లోంచి బయటకొచ్చి, గేటు దగ్గర గుంపులో ఆగాడు. గంటకొట్టారు. గార్డువిజిల్ వేశాడు. జనం అటూ యిటూ పరుగెడుతున్నారు. తలుపుదగ్గర నిల బడి ప్లాట్ఫాకం పరకాయిస్తున్నాను. అప్పుడు కుటుంబరావు, పిల్లనెత్తుకొన్న స్త్రీ వెనక్కితిరిగి నాకేసి చూశారు. వెనక్కి నాకేసిచూస్తూ ముందుకు నడిచిపోతున్నారు. కుటుంబరావు

పిల్ల నెత్తుకున్నాడు. ఆ పిల్ల చెయ్యి పైకెత్తి 'పో, పో'
అన్నట్లు ఆడిస్తోంది. కుటుంబరావు నాకేసి చూస్తూనవ్వినట్లు
స్ఫురించింది. ఆమె పెదవులమీద కూడా చిరునవ్వులాంటిది
కనబడింది. రైలు కదులుతోంది. కుటుంబరావు నావైపు చూస్తూ
ముందుకి నడుస్తున్నాడు. ఆ నవ్వు, ఆ చూపు నా ఆంతరంగి
కంపై వెక్కిరింపు వ్యాఖ్యానంలా భీకరంగా కనపడింది. పరు
గెత్తుకొంటూ వొచ్చి రాయన్న ఫ్లాస్కు నా చేతికందించాడు.
నా చూపుగుండా గేటుకేసి చూస్తున్నాడు రాయన్న.

'నా చెల్లెలు– దాని మొగుడండి. ఆర్మీలో చేరాడు
లెండి – కనకయ్య. శెలవుమీద వొచ్చి, స్నేహితుల్ని చూడా
లని రెండురోజులుండి గూడూరులో ఎక్కాడండి—మళ్ళా
వొస్తాలెండి బెజవాడలో...' అంటూ రాయన్న తన పెట్టెలో
కెక్కాడు. నిజంగా రెండో తరగతి పెట్టెలో ప్రజాస్వామ్యం
తన స్వరూపాన్ని అద్దంలో మాదిరి చూసుకోవడమే కాకుండా
తన తత్వానికి వ్యాఖ్యానాన్ని కూడా సమకూరుస్తుంది.

# మేడ మెట్లు

అధికారి, ఎల్లాగో మూడు మెట్లూ ఎక్కి, వరండా లోకి చేరుకున్నాడు. ఆయన తొడుక్కున్న మూసేసిన కంఠి మెడకోటుకి ఏడు బొత్తాము లుంటాయి; వాటిల్లో పై రెండూ వూడదీసేటప్పటికి, ఆయన వోపికంతా అయిపోతుంది. బొత్తా ములూ, కోటూ, టై, కాలర్-యివన్నీ నాగరికత తగిల్చిన శృంఖలాలు; సంస్కారానికి మానవుడు చెల్లించే సుంకం. అల్లా అనేటందుకుఅర్హతవుండాలంటే, ఆశృంఖలాలుతగుల్చు కోవాలి ... లేకపోతే ఆ నిర్వచనానికి విలువ ఏమీ వుండదు. 'ఈ జగత్తంతా మాయ, ఏదో యధార్థం తగులడింది. అదే విటో నాకు తెలిసి చావదు'—అని ఇంగ్లీషులో ఆరొందల పేజీల గ్రంథం వ్రాసినందుకు, గ్రంథకర్తకి డాక్టరేట్ బిరుదు తగిలించి, ఏ విశ్వవిద్యాలయానికో అధిపతిని చేసేవరకూ సంఘం వూరుకోదు. 'ఏమిజన్మం బేమిజీవనమూ' అని థర్డ్ క్లాస్ కంపార్టుమెంటులో పాడుకుంటూ కానీకి చెయ్యిచాచే ముష్టి కుర్రాణ్ణి, కంచి అవతలికి నెట్టేస్తారు, అదేం చిత్రమో! వాడికి వూడని బొత్తాములకోటు లేదు గనకా?

అనుకుంటూ అధికారి బొత్తాములన్నీ వూడదీసి, కోటు విప్పి, కర్రని మూలకిగెంటి కుర్చీలో కూలబడ్డాడు. వెంటనే ఏదో మరిచిపోయిన సంగతి జ్ఞాపకంవొచ్చింది. మూడు నిముషా లాలోచించాడు. ఆ మెట్లగదిలో బల్లమీద పత్రిక తీసుకురావడం. లోపలికి చూచాడు. బల్లమీద గడి

యారం కనబడుతోంది. టైము తెలీదు. చూడాలంటే కళ్ళ
జోడు కోటుజేబులో వుంది. 'హసీ' అని కేకేశాడు. 'హసీ' కి
చిన్న చిన్న వొస్తువులు నోట్లోకరుచుకునిపట్టుకురావడం నేర్పి
వుంటే ఎంత బాగుండును! 'హసీ' తోక కిందికిదించేసి, మెట్ల
మీద గంతులేస్తోంది. లోపలికి చూపించి 'ఆ పేపరల్లా
తీసుకురా' అని సంజ్ఞచేశాడు. 'హసీ' మూలనున్న కర్రని
నోట్లో కరుచుకుని మెట్లెక్కి పైకి వెళ్ళిపోయింది. ఆ కర్రని
తన కిచ్చినా బాగుండును: దాని సహాయంతో లోపలి కెళ్ళి
పత్రిక తీసుకొచ్చి, చదువుకుంటూ కూర్చుండును. నిజంగా
జీవితంలో సంతోషం కలగజేసేవి ఇట్లాంటి స్వల్పవిషయాలే.
రోజూ ఎనిమిదింటికి హాజరయ్యే 'తంబిగాడు' ఇవాళ పదిగంట
లైనా రాలేదు. అధికారి వూరికే తనముందు పరుచుకున్న
నేలనీ, దానిమీద వొరిగినఆకాశాన్నీ చూస్తూకూర్చున్నాడు.
దేన్ని చూడడం? అర్థంపర్థంలేని కొండలు బయళ్ళువూరికే
మేఘాలని పోగుచేసుకుని, వొక్కవర్షంచుక్కైనా కర్చుపెట్ట
లేని పీనాసి ఆకాశం—డాక్టర్లు, నవ్వులు చంపుకుతింటే ఇక్కడి
కొచ్చాడు... ఆరోగ్యానికి, అందానికీని. తనకి ఆరోగ్యం,
భార్యకి అందం.

అరవైయేళ్లు దాటింతర్వాత, ఆరోగ్యంసంగతిజ్ఞాపకం
వొస్తుంది. ఈ డాక్టర్లకి; ఏభైయేళ్ళు దాటినా, తన భార్యకి
తన అందంతోతప్ప, ప్రకృతి అందంతో ప్రమేయంలేదు.
మేడమెట్లు దిగి కిందికి రాదుగా! తను పైకి ఎక్కలేడు!

'మా ఆవిడకి అందంతో నిమిత్తంలేక మెట్లు దిగదు;
ఆరోగ్యంలేక నేను మెట్లెక్కలేను. ఇల్లాంటిచోటికి పంపించా

రయ్యా!' అని సలహాయిచ్చిన డాక్టర్లకి ఉత్తరం వ్రాద్దా
మని సంకల్పించుకున్నాడు అధికారి. కానైతే కాగితాలేవీ
కలమేది? అవి దొరికేటప్పటికి వ్రాద్దామనుకున్నది కాస్తా
మర్చిపోతాడు. అక్కడికీ తను మెట్లున్న కొంపలొద్దు మనకి,
ఎక్కాదిగా చెయ్యలేం, ముసిలాళ్ళం—అని భార్యతో ఎంత
చెప్పినా ఆవిడ వింటేగా? తనకి మేడే కావాలంది. మేడలేక
పోతే దర్జాకి లోపమనేమో! ఏదో రెండురోజులు ఓపికపడితే,
పెద్దమ్మాయి 'కళ్యాణి' పూనానుంచి సెలవుకొస్తుంది, తన
కష్టాలన్నీ తీరతాయి— అనుకొని, అధికారి తమాయించు
కున్నాడు. తనపేరుకి తనకే నవ్వొచ్చింది. అధికారిట! కాలేజీ
ప్రొఫెసరుగా ఆరేళ్ళు అమాయకులైన విద్యార్థులమీద అధి
కారం చలాయించాడు. పత్రికా సంపాదకుడుగా ప్రూఫ్‌రీడర్ల
మీద పదేళ్ళు చలాయించాడు. దివాన్‌గా ఎనిమిదేళ్ళు
అడ్డమైనవాళ్ళమీద చలాయించాడు. ఇక్కడ, యిప్పుడు ఎవరి
మీద చలాయించడం! కొండలు; వర్షం కురవడమైనా చేతకాని
దద్దమ్మ మేఘాలు: గడ్డిమొలిస్తే ఎవరేనా కోస్తారని
రాళ్ళగుట్టల్లోకన్న బయళ్లు — వీటిమీద చలాయించాలి.
ప్రొద్దున్న తను షికారుకెళ్ళినప్పుడు, ఓ ముసలి దౌర్భా
గ్యుడు దారిలో కలుసుకుని, ఆ కొండల్ని, బయళ్ళనీ,
మేఘాలనీ మెచ్చుకోడం మొదలెట్టాడు! బాగా వాదించి, కసి
తీరా తర్కించి అంతా తప్పని ఋజువుచేసి, ఆ దౌర్భాగ్యుణ్ణి
తన భార్యముందు ఓడిస్తేకాని, తనకు శాంతి సమకూరేటట్టు
లేదు. ప్రతిరోజూ పత్రికల్లో దేశంలో శాంతి, అంతర్జాతీయ
రంగంలో శాంతి అని ఘోషిస్తాడేకాని, తనహృదయంలో

శాంతిని గురించి చెప్పుకోడేం! సంపాదకుడికి లేఖ వ్రాయాలి. 'అయ్యా, ఆరోగ్యంకోసం కొండల్లో కెళ్ళమనే డాక్టర్లనీ, అందంకోసం ఏకాంతంలో కెళ్ళమనే కవులనీ, ప్రభుత్వంవారు బంధించి, జైళ్ళలో వుంచటం అవసరంగా తోస్తోంది—ఏం లాభం! కాగితం, కలం లేవుగా! ఇందాకా ఏదో యిట్లాంటి ఉత్తరం వొకటి రాద్దామనుకున్నాడు. అదేమిటో వొక్కటీ జ్ఞాపకంరాదు. అధికారికి తీవ్రంగా కోపం వొచ్చేసింది.

చప్పట్లుకొట్టి భార్యను కేకేశాడు.

ఆవిడ మెట్లపైన నుంచుంది.

'కిందికి దిగు,' అని గర్జించాడు అధికారి.

'ఏం, ఎందుకు?'

'నా కనేకం కావాలి'

'మీరే రండి పైకి' అంది నవ్వుతూ.

'నే నొచ్చేప్పటికి, అవన్నీ మర్చిపోతాను; యీ మెట్ల కొంప వొద్దంటే వినావుకా—'

'ఎందుకంత రుసరుస? తల్చుకుంటే మీ రెక్కగలరు మెట్లు' అంది మళ్ళా నవ్వుతూ. ఆ నవ్వుతో అధికారి కోపం తగ్గింది. ఆ నవ్వులో ఏముందో మజా! ఆయన కళ్ళకి ఆవిడ కొండమీద ప్రతిష్ఠించిన అమ్మవారివిగ్రహంలా వుంది.

'అంతేకాని నువ్వు దిగవన్నమాట?'

'మెట్లెక్కడం, దిగడం వొంటికి మంచిదని డాక్ట రన్లేదు?...'

'అంటా డంటాడు! నాణ్ణి మెట్లపైనుంచి, కిందికి వొర్లించి, కిందినుంచి పైకిలాగి, మళ్ళా కిందికి దొర్లిస్తే'...

దేశంలో అన్నం కరువేనా తగ్గుతుంది. డాక్టరు, నూట తొంభై పౌన్లు.'

ఇంతట్లో 'తంబి' వొచ్చాడు. వాడిచేత గ్లాసుడుపాలు, పొగాకుడబ్బా కిందికి పంపించింది.

అధికారి పాలు త్రాగి చుట్ట కాలుస్తూ, పత్రిక చదవడం సంగతి మరిచిపోయ్యాడు. ఆయన ఆలోచనలు 'దౌర్భాగ్యుని' వేపుకి వెళ్ళసాగాయి. తను షికారుకి వెడుతుంటే, అతను రాయిమీద పడుకుని పాడుకుంటూ కనపడ్డాడు: కనపడగానే అతను ముదుసలి; ఎట్నొచ్చి అతని నెరిసిన తలవెంట్రుకలు వూడలేదు. నిర్మానుష్యమైన ఆ ప్రదేశంలో దేవతలా ప్రత్యక్షమయ్యాడు. ఇద్దరూ అరగంటసేపు కబుర్లు చెప్పుకున్నారు; సంభాషణ, మొదట్లో గాడిదల్ని గురించి ప్రారంభమైంది... ఎందుకో దూరంగా బీళ్ళల్లో వారి కో గాడిద కనుపించింది. ఆ ముసలాయన ఆకొండల్ని, బయళ్ళనీ మెచ్చుగోటం మొదలెట్టాడు. తనకి వొళ్ళు మండిపోయింది వాదించుకున్నారు యిద్దరూ. 'ఇంతటితో వాదం పూర్తి కాలేదు. యింటికి రా' అని ఆహ్వానించాడు. తను వొచ్చేస్తూ, నీ పేరేమిటనడిగితే 'దౌర్భాగ్యుడు' అన్నాడు. నిజంగా అన్నాడా, తన వూహా? అధికారి కళ్ళు నీరసంగా మూతబడ్డాయి. గాలికి కొట్టుకుని కొట్టుకుని అలిసి వేలాడిపోయిన వొంటిఆకులా అతని మెడ భుజంమీద నిశ్చితంగా వాలిపోయింది.

ఎంతసేపయిందో —

ఎవరో అతన్ని లేపారు—తంబిగాడు.

వాడి బుజంమీద చేతులు ఆనించి అధికారి మెల్లి క్కడం సాగించాడు. మెట్లమీంచి ఏదో మనిషి ఆకృతి ... మరీ మరీ పెద్దదవుతోంది ... నాలుగు, ఐదు, ఆరు ... ఎవరిది ఆ ఆకృతి ... ఏడు ఎనిమిది ... తన భార్యఅరుణ! ... తొమ్మిది ... తెల్ల మబుల్ని కప్పుకొన్న పచ్చకొండలా ఆనిశ్చం. నురిగల్ని పెనవేసుగున్న కెరటంలా ఆ తెల్లటి జుట్టు; చీకట్లో చలించని నీటిలో మసలిన చంద్రబింబాల జంటలా ఆ కళ్ళజోడు — పన్నెండు, పదమూడు — మెల్లెక్కడం ఎంత సులభం! — పదహేను – పదహారు – మెట్ల భవనాలపై తిరిగి, మౌనంతో ముసుకున్న ఆమె పెదవులు, సముద్రంలో కలిసిపోయ్యే సంధ్యాసమయ మేఘాలలో తన దృష్టిని ఆరిస్తోంది- పందొమ్మిది—అది నవ్వా! పై పళ్ళు రెండు వూడిపోయ్యాయి. పాపం బంగారంపళ్ళు వేయిస్తానంటే వొద్దంది.. పెదవులతో నవ్వడం మానక– అరుణకే తెలుసు ... ఇరవై, అమ్మయ్య–ఇరవై నాకటి చేతులతో అందుకొంది – అధికారి అరుణలో ఐక్యం అయి పోయ్యాడు.

* * *

ఆ రోజున ఎవ్వరూ మళ్ళా మేడమెట్లు దిగలేదు. 'దౌర్భాగ్యుడు' రాలేదు.

* * *

మొన్నాడు తెల్లారి, ఎనిమిదింటికి, అధికారికి అనూహ్యంతంగా 'దౌర్భాగ్యుడి సంగతి జ్ఞాపకంవొచ్చింది. వెళ్ళి వెదికి తీసుకురావాలని బైలుదేరాడు. పైగా డాక్టర్లు రోజూ ఉదయం ఒక మైలైనా నడవాలన్నారు ... డాక్టర్లజోలి తన కెందుకు ?

ఈ రకంగా స్త్రీలకి చెప్పరేమో డాక్టర్లు; ఎవళ్ళు ఏది చెయ్య గలిగితే దాన్నే ప్రచారం చేస్తారు కాబోలు. ఇంతమంది డాక్టర్లుండికూడా, యీ దేశంలో జనాభా పెరిగిపోవడం నిజంగా ఆశ్చర్యమే!

'నువ్వు నన్ను దింపనక్కర్లేదు. నేనే దిగుతాను'— అంటూ అరుణ చేతిని తొలగించేసి, వొంటిగా మెట్లుదిగడం మొదలెట్టాడు అధికారి. ఒక మెట్టు దిగేసరికి, మెట్లగది గుమ్మంలో దౌర్భాగ్యుడిమొహం కనిపించింది. దౌర్భాగ్యుడు రాతిబొమ్మలా స్తంభించి మెట్లకేసి చూస్తున్నాడు.

'అదేమిటి మాటా మంతీ ఆడవేం... నేను దిగలే నా ...?' అధికారి ఆఖరిమెట్టుమీద అడుగుపెట్టగానే, అరుణ లోపలి కెళ్ళిపోయింది.

'అదేమిటి, తెల్లబోయి చూస్తావు. ఎప్పుడూ మేడ మెట్లు చూళ్ళేదా!' ఆయాసంతో అధికారి చివరి మెట్టుమీద కూర్చుండిపోయాడు. దౌర్భాగ్యుడుకూడా ఆయనప్రక్కనే కూర్చున్నాడు.

'ఇదిగో చూడు...'

'చూస్తున్నా, వింటున్నా ...'

'నీతో ఏదో చెప్పాలనుకున్నా ...నీ కేమన్నా జ్ఞాపకం వుందా?'

'ఓ, మీరు గట్టిగా మాట్లాడనక్కర్లేదు. నాకు చెముడు లేదు.'

'ఆవిషయంగాదు. ఆఁ జ్ఞాపకంవొచ్చింది-యీకోటు విప్పాలి. మనం యింక బైటకి వెళ్ళంగా'

అని. కాసేపు కోటునివిప్పే కార్యక్రమం జరిపాడు అధికారి.

'ఇప్పుడు చెప్పు నేనేం మరిచిపోయ్యానో.'

'కొందరు...' అని నవ్వాడు దౌర్భాగ్యుడు. సక్రమంగావున్న పళ్ళనరసని బైటపెడుతూ.

'నువ్వసాధ్యుడవే — నేనంటాను... యిప్పుడు మరిచిపోయ్యాను. కాసేపుండి చెబుతాలే—అన్నట్టు నువ్వేమన్నా టిఫిను ఫలహారంచేస్తావా, చేశావా...?'

'చేశాను; ఐనా అభ్యంతరంలేదు.'

'ఇదుగో, అరుణా — ఆ, నీ పేరేమిటి?'

'చెప్పాగా—దౌర్భాగ్యుడు.'

'భలే సరసమే-మా యిల్లాలితో యీ దౌర్భాగ్యుడికి ఫలహారం పట్రావే అనమంటావా- ఇదిగో, అరుణా! ఫలహారం తీసుకురా...'

అరుణ మెట్లమీద నుంచుంది. ఆవిడచుట్టూ, హాసీ, గంతులేస్తోంది. మెట్లమీదనుంచి గబగబా దిగి - వారిద్దరి మధ్యకీ వొచ్చింది. ఇంతలో 'తంబి' వొచ్చాడు. పైకిరమ్మని సంజ్ఞచేసింది అరుణ 'తంబి' అధికారిని లేవదీసి వరండాలోకి తీసికెళ్ళి, కుర్చీలో జేర్లవేశాడు. మరో పడకకుర్చీలో దౌర్భాగ్యుడు కూర్చున్నాడు 'తంబి' ఫలహారం తీసుకొచ్చాడు... రొట్టె, వెన్న, పంచదార, రెండు కమలాఫలాలు, కాఫీ.

'నిన్నకూడా నాలా, యీ వూరు డాక్టర్లు పంపలేదు గదా?' అని అడిగాడు అధికారి.

'లేదు. అంటే సాధారణంగా డాక్టర్లకి వస్తూంటున్న వూరువాదిలి వెళ్ళే అవకాశం వుండదు. అంచేత యితరుల్ని మరోచోటికి పంపేనా తృప్తిపడతారు-' ఈవిషయం అధికారికి నచ్చినట్లుంది: బహు సంతోషంతో 'వూ' కొడుతూ కుర్చీ కొంచెం ముందుకి జరుపుకున్నాడు.

'నేను దివానుగా ఉంటున్న రోజుల్లో వోమారు, తాశీల్దారుకి జబ్బుచేస్తే, మదనపల్లి పంపించారు డాక్టర్లు; ఆయన వొచ్చాక, ఆయనభార్యకి జబ్బుచేసింది; ఆవిణ్ణి పంపించారు,-తరువాత ఆయన్ని; మళ్ళా తరువాత ఆవిణ్ణి. భార్యాభర్తల వియోగంవల్ల అన్ని జబ్బులూ కుదురుతాయేమో!-' అని అధికారి నవ్వడం సాగించాడు.

కాసేపు నిదానించి మాట అందుకున్నాడు.

'నువ్వు నవ్వవేం? నీకు పెండ్లాం పిల్లలూ వున్నారా? యింతకీ తాశీల్దారు పెళ్ళాన్ని చూడ్డం తటస్థించింది; ఏజబ్బూ లేదు; దుక్కలాగుంది—'మళ్ళా నవ్వుతున్నాడు.

'అంటే ఆడాళ్ళజబ్బులు పైకి కనబడవుగా మరి—' అన్నాడు దౌర్భాగ్యుడు.

'లోపల రోగం అంటావు - మీ ఆవిడ కేం జబ్బు?'

'నాకు భార్య లేదు;'

'పోయిందా పాపం?'

'అసలు పెళ్ళికాలేదు.'

'పిల్లలు?-మరే మరే—అసలు పెళ్ళేకాలేదన్నావుగా. పెళ్ళికానంత మాత్రాన పిల్లలుండగూడదని లేదనుకో—' అధికారి. తనలో తనే నవ్వుకొంటున్నాడు.

'ఇదిగో, నిన్ను 'దౌర్భాగ్యుడు' అని పిలవడం ఏమీ బాగాలేదు. నీపేరేమిటో చెప్పు, చంపక.'

'నాకేపేరంటే బాగుంటుందో, ఆ పేరే పెట్టి పిలవండి'

'ఐతే ఆలోచించనీ—నువ్వు కొండల్ని మహా మెచ్చుకొంటున్నావు గనుక, 'కొండయ్య' అని పిలుస్తాను ... లేకపోతేను,' అని అధికారి వెటకారంగా కోపం ప్రకటించాడు.

'అల్లాగే పిలవండి - నాకు కొండలంటే నిజాంగా ఇష్టం. వాటిల్లో స్థిరత్వంవుంది. అవి కదలవు, మారిపోవు; మనుష్యులు మోసగిస్తారు. మోసపోతారు! మారిపోతారు; అసంతృప్తి పోతారు; కొండలు మాత్రం అల్లాగే వుండిపోతాయి ...' అన్నాడు కొండయ్య.

'అది బాగానేవుందయ్యా, అయితే ... మేఘాన్నీ, నదులనీ మెచ్చుకొంటావెందుకు?'

'అవన్నీ ఆ కొండల్ని పట్టుకుని దేవుళ్లాడతాయి గనుక'

'కొంపతీసి నువ్వు కవివా ఏమిటి చెప్పు ...'

'ఇంకోళ్ళకొంపలు తీసేవాడు సంస్కర్త, తనకొంప తీసుకునేవాడు కవి' అన్నాడు 'కొండయ్య' గూఢంగా.

'నీ కసలు కొంపే లేదుగా-' అని వికృతంగానవ్వాడు అధికారి. మళ్ళా యేదో జ్ఞప్తికివొచ్చి-

'నీకు ఆ తాశీల్దారు భార్యఫొటో పంపించాలి' అని చప్పట్లుకొట్టి 'తంబిని' కేకేసి, అమ్మగార్నడిగి సంస్థానం ఫొటోల ఆల్బమ్ తీసుకురమ్మన్నాడు.

'తంబి' ఆల్బమ్ తీసుకొచ్చాడు.

'ఆ, యిదిగో ఆల్బమ్ - యీావిడా, తాశీల్దారుగారి సతీమణి. రెండో పెళ్ళి పెళ్ళామనుకో-చూసుకో ఎంతమజాగా వుందో. అరుంధతి, శకుంతల, తిలోత్తమ, 'జ్యూలియెట్' అబ్బో-యీావిడికి చాలా పేర్లుండేవి. ఈవిణ్ని చూసినవాళ్ళు నిద్రాదేవికి విడాకులిచ్చారంటే నమ్ము ఒకవేళ నిద్రాదేవి వదలకపోతే, కాసేపు స్వప్నకాంతతో గడిపేవారు—' జ్ఞాపకాల సౌందర్యంతో అధికారి కళ్ళు మెరుస్తున్నాయి.

'...ఆవిడకి కొంచెం ముందుగా కుర్చీలో యీావ్యక్తి ఎవరు చెప్పుకో-పాగావుంది, గుర్తుపట్టవులే! ... నేనే - యిప్పుడంటే జుట్టంతా వూడిపోయిందిగాని ... ఆవ్యక్తి యీావ్యక్తి కోసంపరితపించిందంటే ఆశ్చర్యపడతావా?' జ్ఞాపకాలశక్తితో అధికారి కాలప్రవాహంలో ఎదురీత సాగించాడు.

'ఆ, నే నాశ్చర్యపడతాను' అన్నాడు కొండయ్య. అధికారి నిర్ఘాంతపోయాడు పశ్చాత్తాపంగా కనుబొమ్మలు చిట్లించాడు.

'స్త్రీలు పరితపించరు; యితరులకి పరితాపంకలిగిస్తారు. అట్లా పరితపించిన వ్యక్తులలో తమరొకరు కావచ్చు.'

అధికారికి చాలా కోపంవొచ్చింది.

'మంచివాడివే-ఆరోజుల్లోనన్ను నువ్వుచూాళ్ళేదు మరి. అప్పటిశక్తి, అందం, దర్జా: యిప్పటిఅనుభవం, జ్ఞానం-యీారెండు కలిస్తేనా -' అని అవి కలిస్తే యెట్లావుంటుందో వూహించుకుంటూ నిశ్శబ్దంలోపడ్డాడు అధికారి.

'ఈరెండూ కలిసినవాళ్ళకి స్త్రీ అక్కరేలేదు; కలవని వాళ్ళు స్త్రీలకి అక్కర్లేదు.'

'నీకేం తెలీదు - నీకు పెళ్లా, పిడాకులా - ఆడదాని మొహం యెరుగుంటేగా !'

'మొహం నే యెరుగను, కాని మనస్సు ఎరుగుదును.'

'ఏంకథ-ఒకప్పుడు గంద్రగోళం చేసినవాడి వైఖరే నీది-వారే, 'తంబీ' అమ్మగా రేంచేస్తున్నారు!'

'కుట్టుకుంటున్నారండి.'

'నువ్వు వూళ్లోకెళ్ళి చుట్టలట్రా-'

తంబి వెళ్ళాడు. అధికారి తన కుర్చీ యింకా దగ్గరగా లాక్కుని, కాళ్ళు స్తంభానికి ఆనించాడు.

నడిచిపోతున్న 'తంబి' కేసి చూపుతూ, కొండయ్య ప్రారంభించాడు.

'నేను వాడంతవుండేవాణ్ణి. మా యింటిపక్క నే రెండు పెద్దమేడలుండేవి. మొదటిది పాతమేడ అందులో ఎవ్వరూ కాపురం వుండేవారు కారు-కాని సత్రవులోలాగా జనం వొస్తూ పోతూ వుండేవారు. దాని పక్కమేడలో ధనంగారి వాళ్ళుండేవారు; ఆ రెండమేడలూ వాళ్ళవే. చాలా స్థితిపరులు. ఒకరోజున నేనూ మా అత్తయ్యా గుళ్ళోకెళ్ళాం; అక్కడ చూశాను ధనాన్నీ, వాళ్ళమ్మనీ. ధనం పదేళ్ళపిల్ల; నేనో రెండేళ్ళు పెద్ద గుడిలోపల దేవుడిదగ్గర అంతా చీకటి! ఆమదం బుడ్ల వెల్తురులో ధనం మహాలక్ష్మిలా మెరిసిపోయింది. అటు కేసిచూస్తూ నమస్కారాలు పెట్టి, అత్తయ్యని చూసి చెంపలేసుకున్నాను. తరువాత బోలెడుమంది జనంవొచ్చి మమ్మల్ని నెట్టేశారు. అత్తయ్యా నేను విడిపొయ్యాం. ధనం, వాళ్ళమ్మా అర్చనలేవో చేయిస్తున్నంతసేపూ నేనక్కడే వుండిపొయ్యాను'

వాళ్ళతో బాటే వాళ్ళ వెనకాలే నేను నడచివెళుతున్నాను. మా యింటివేపు కేసి నడుస్తున్నాం. రోడ్డుకి రెండువేపులా పెద్ద పెద్ద చెట్లకొమ్మలు వ్రేళ్ళాడుతున్నాయి సంతబండి గూడు. కొమ్మలకితగిలిసన్నకొమ్మలు ధనం నెత్తినిదూసుకున్నాయి. ధనం తల్లోపూలు కిందపడిపోయాయి. వాటికోసం వొంగుని తీసుకోబోయింది; వాళ్ళమ్మ కూకలేసి, చరిచింది ఆ పూలని వొదిలేసి, వాళ్ళమ్మతో నడిచిపోతోంది. ఆ పూలని నేను తీసుకున్నాను గుళ్ళో తీర్థంతో యింకా తడిగానే వున్నాయి ఆ పూలు వాటిపక్కనే ధగ దగా మెరిసిపొయ్యే చిన్ని వజ్రపుటుంగరం అక్కడ పడిపోయింది. దాన్నితీసుకున్నాను. వాళ్ళు వాళ్ళింటి కెళ్ళిపొయ్యారు నాకేమీ తోచకపువ్వుల రేకలు నోట్లో చప్పరిస్తూ, ఖాళీమేడమెట్లమీద కూర్చుండి పొయ్యాను. ఖాళీ మేడకి ముందు అరుగుమీదనుంచి మెట్లు దొడ్లోంచి మరోరకం మెట్లూ వుండేవి. దొడ్డివేపు మెట్ల మీద కూర్చున్నాను. ఒక గంట జరిగింతర్వాత ధనం రోడ్డంట యేదో వెతుక్కుంటూ మా యింటికేసి వొస్తోంది. నాకు తెలుసు వుంగరంకోసం అని. దగ్గరగా వెళ్ళాను.

'పూలు పారేసుకున్నావు' అన్నాను, పువ్వులు చూపుతూ.

'కాదు, కాదు.'

'మరేమిటి వెదుకుతున్నావు?'

'ఏమీ లేదు.'

నాకేసి చూడకుండా అల్లా నడిచిపోతోంది.

'చెప్పు, నేనూ వెదుకుతాను' అన్నాను.

'అమ్మ కూకలేస్తుంది.'

అని బిక్కమొహంపెట్టి, మెట్లమీద కూర్చుంది. అప్పట్నుంచీ నాకా ఉంగరం యివ్వాలనిపించలేదు ఏడుస్తూంటే జాలేసింది. కింది మెట్టుముందు బోలెడు యిసకుంది. అందులో కూచ్చుని దూదుంపుల్ల ఆడడం మొదలెట్టి, ఆటకి రమ్మని పిలిచాను. రానంది. నేనొక్కణ్ణే ఆడుకోడం మొదలెట్టాను. కొంతసేపయింతర్వాత, వొక చేతులో పువ్వులుంచుకొని, రెండో చేతిలో ఉంగరం వుంచి ధనాన్ని కళ్ళుమూసుకో మన్నాను. మూసుకుంది. తెరవమన్నాను; తెరిచింది.

ఈ రెండింటిలో యేది బావుంది?' అని అడిగాను. ఉంగరంచూసి కొండంత మొహంచేసుకుంది.

అధికారి కుర్చీలో కదిలి, 'అందుకా కొండలంటే ని కిష్టం?' అన్నాడు.

'తే, నా వుంగరం' అని లాక్కోబోయింది. నేను గుప్పిడి మడిచేశాను.

'ఏది బాగుందో చెబితేకాని యివ్వను' అన్నాను.

ధనం నా ప్రశ్నకి సమాధానం చెప్పకుండా వొచ్చి, నా గుప్పిడి పట్టుకుని చేతిని బరికి వేళ్ళని పీకుతోంది. నేను గుప్పిడి విప్పలేదు. 'యియ్యి యియ్యి' అని చేతిని కరిచింది. నేను వుంగరాన్ని రెండో గుప్పిట్లోకి ఫిరాయించాను.

'అమ్మతో చెబుతాను, చూసో' అంది.

నేను మెట్లెక్కి పైకి పరుగెత్తాను; తనూ పరుగెత్తింది. అల్లా అరగంటసేపు, మెట్లమీద పరుగెత్తాం. చివరికి ధనం అలిసిపోయి మెట్లమీద కూర్చుండిపోయింది. నేను మెట్లకింద

దూపుంపిల్ల ఆట అభినయించి వుంగరాన్ని యిసుకలో దాచేసి, మాయంచేశానని చెప్పాను. ధనం మెట్లుదిగలేదు. కిందికి రమ్మన్నాను! దిగనంది. దిగితే వుంగరంయిస్తానన్నాను. అక్కర్లేదు పో, అంది నేను వుంగరం తీసుకు వెళ్ళి పొయ్యాను.

ఇట్లా లాభంలేదు మంచిచేసుకుంటే కాని వుంగరం దొరకదనుకుందో యేమో రోజూ ఏదోవొంకని మా ఇంటికి రావడం, మేం యిద్దరం మేడమెట్లమీద ఆడుకోడం, కొన్ని వారాలు జరిగింది. ఏమండోయ్, మీరు వింటున్నట్లు లేదు.'

అధికారి కళ్ళు మూతలు పడుతున్నాయి. చిత్రమైన కలలోంచి లేచినట్లు తటాలున లేచి, కళ్ళు నులుపుకొని తెల్లబోయి చూశాడు.

'అవునవును-బాగుంది; తరవాత ఏం జరిగింది?'

'మీరు వినడంలేదు నేను చెప్పను.'

'చెప్పకేం చేస్తావ్, మహాచక్కగా చెప్తావు. ప్రేమ గాథ మొదలెట్టినవాడు ఆగడం నే ఎరగను.'

'ఇది ప్రేమగాథ కాదు. ఒక్క పురుషుడు మాత్రమే ప్రేమిస్తే స్వీయచరిత్ర; అవతల స్త్రీకూడా ప్రేమించినప్పుడే ప్రేమగాథవుతుంది' అన్నాడు కొండయ్య.

'ఓయి పిచ్చివాడా! ఏ స్త్రీకూడా, 'నిన్ను ప్రేమించా' ననదు. అంటే మొగాడికి లోకువవుతుంది. మా తాశీల్దారు భార్యవిషయం తీసుకో-తన్ను ప్రేమించి చేసుకుందని మురిసి పొయ్యేవాడు, అమాయకుడు—'అంటూ అధికారి నవ్వడం సాగించాడు.

తంబి' చుట్టలు తీసుకొచ్చాడు. అధికారి చుట్టముట్టించాడు.

'ఏదీ యిహ చెప్పు ఎంత విసుగ్గావున్నా తట్టుకోగల్ను'.

'అయితే నే చెప్పను' అన్నాడు కొండయ్య.

'నువ్వు చెప్పకపోతే ప్రమాదం లేదు. నే చెబుతా వినునా చిన్నప్పుడు,-అబ్బో! బాగా చిన్నప్పుడు, నల్భై యేళ్ళనాటి సంగతి...' అని అధికారి వొక కల్పితగాథ మొదలెట్టాడు. ఆగాథకి అంతమయ్యే ప్రాప్తం లేదు. అధికారి భార్య భోజనానికి పిలిచింది. ఆయన మేడమెట్లు ఎక్కలేను, కిందకు పంపించమన్నాడు. మెట్లగదిలో 'తంబి' పీటలు, కంచాలు పెట్టాడు. ఇద్దరూ అన్నం వొడ్డించుకు తిన్నారు. నిద్రపోయి మధ్యాహ్నం మూడింటికి లేచాడు, అధికారి.

'కొండయ్యా వున్నావా? వెళ్ళిపొయ్యావనుకున్నా! నాకు యిందాక వొక సందేహం వొచ్చింది. మళ్ళా మరిచిపోయ్యాను.

'జ్ఞాపకం తెచ్చుకోండి.'

'ఐతే ను వ్విక్కడి కెందుకొచ్చావ్!'

'మీరు రమ్మంటే.'

అది కాదయ్యా,—ఊవూరు!'

ఇక్కడికి నాలుగుమైళ్ళ దూరంలో పండ్లు, పువ్వులు ఎగ్జిబిషన్ పెట్టారు మంచి విత్తనాలు పట్టుకుపోదామని. నా కో ఆరెకరాల భూముం డేది. ఎరక్కపోయి, అందులో పునాస వేశాను. దెబ్బతిన్నాను. మళ్ళా అందులో వొకతోట వెయ్యాలని.'

'అరవై యేళ్ళొచ్చాక చదువుకోక మనున్నగొట్టు కున్నాట్ట! నువ్విప్పుడేస్తే తయారయ్యేటప్పటికి నాలుగేళ్ళైనా పట్టదూ! ఎవరికోసమనీ, ఎందుకోసమనీ?' అన్నాడు అధికారి

'ఆ తోటలో వొక ఆశ్రమం నిర్మిస్తాను. నాలాంటి బీద వృద్ధ బ్రహ్మచార్లకి అది నిలయంగా వుండేటట్లు విల్లు రాస్తాను'

'అంటే!—ఓహో, నీ ప్రేమగాథ వింటే కాని తెలవదనుకుంటా. ఏదీ చెప్పు - 'తంబీ!' 'టీ !'

'తంబి' ట్రేలో రెండుకప్పుల టీ, రొట్టె, వెన్న తీసుకొచ్చాడు. అధికారి రొట్టె పాలల్లో ముంచుకుని చప్పరించి తిన్నాడు ఫలహారం అయినతర్వాత, యిద్దరూ మళ్ళా కొండలకేసి షికారుగా నడుస్తున్నారు. సాయంత్రం ఐదు దాటింది. నిశ్చింతగా పడుకొన్న స్త్రీ రొమ్ములమీద ఆకు పచ్చచీర మడత కొంగులా, రెండుకొండలూ మెదలకుండా వున్నాయి. కాలిబాటలు, రొమ్ములమధ్య నలిగిన చీర మడతలు - నిద్రలో ఏడ్చిఏడ్చి ఎఱ్ఱబడి, తెరిచిన వొంటి కన్నులా సూర్యుడు కొండ వెనక్కిదిగి కన్ను నులుముకుంటు న్నాడు; చోద్యంచూస్తూ మేఘాలు చుట్టూ చేరుకున్నాయి; ఏదో జ్ఞాపకంవచ్చినట్లు, ఎక్కడో పిట్టకూసింది; సర్వమూ త్యజించిన రాళ్ళుకూడా సంధ్యవేసిన యింద్రజాలంలో యిరుక్కున్నాయి.

కొండయ్య రాతిప్రక్క లేతగడ్డిలో పడుకున్నాడు. అధికారి రాతిమీద కూర్చున్నాడు.

'కొండలు ఆకాశంలోకి దేవుడు వేసిన మేడమెట్లు' అన్నాడు కొండయ్య.

'గాడిదిగుడ్డు' అన్నాడు అధికారి

'మెట్ల చివర వుంటాడు. దేవుడు కిందికి రాడు మనిష్ని పైకి రమ్మంటాడు. మనం వెళ్ళం. వీళ్ళజోలి మనకెందుకని దేవుడుఆమెట్లుపడగొట్టేశాడు పడిపోగామిగిలినవి కొండలు'

'వెళ్ళవయ్యా, మహాచెప్పొచ్చావ్— మెట్లవేదాంతం. నీకు మనుష్యులతో సంపర్కంలేక, కొండలతో తృప్తిపడు తున్నావు. ఎవర్నా స్నేహితులులేనివా డేంజేస్తాడు మరి!' అన్నాడు అధికారి.

'మీరు నాస్నేహితులుకారు?' అన్నాడు కొండయ్య సూర్యుడు పొడవకుండా కళ్ళమీద చెయ్యడ్డుపెట్టుకుంటూ.

'పెళ్ళికానివారికి స్నేహితులుండరు, పిచ్చివాడా!' పెళ్ళాందగ్గరనుంచి పారిపోయేటందుకు స్నేహితులు బాగా పనికొస్తారు. నీ కట్లాంటిపెళ్ళాం లేదుగా. నువ్వు నాకు స్నేహితుడవుగాని, నేను నీకు కాదు' అని అధికారి నవ్వుతూ, కర్రతో నేలని పొడుస్తున్నాడు.

కొండయ్య మాట్లాడలేదు.

'కోపం వొచ్చిందా—లేదులే, పాపం—యేదీ చెప్పు —ధనం కథ—అవుతే ఆ అమ్మాయిపేరు ధనమేనా?'

'కాదు, వేరే పేరుంది. వాళ్ళు ధనవంతులు కాబట్టి నేను 'ధనం' అని వ్యవహరించేవాణ్ణి. ఏడాదిగడిచింది. ధనం వుంగరంప్రమేయం ఎత్తడం మానేసింది. మేం మేడమెట్ల మీద అనేకరకాల ఆటలు ఆడుకునేవాళ్ళం. పట్టుకునే బద్దల

మీాదనుంచి జారడం, పై నుంచి కిందికి; వెనక్కి తిరిగి దిగడం, ఎవరు ముందెక్కుతారోనని పందాలేసుకుని పరుగులెత్తడం— ప్రొద్దున్న గంటా, సాయంత్రం రెండుగంటలు. మాస్నేహం ఎవ్వరికీ తెలీదు-మాకే తెలీదు.'

'మేడమెట్లమీాద ఆడుకునే అవసరం ఎందుకొచ్చిందీ?' అని అడిగాడు అధికారి.

'మరెక్కడా వీల్లేదు. దొడ్లో ఆడుకుంటే వాళ్ళవాళ్ళు కనిపిస్తారు. వీథుల్లో ఆడితే మావాళ్ళు కనిపిస్తారు. కొన్ని రోజులు 'సరస్వతీ, భక్తుడు' ఆట ఆడేవాళ్ళం. నాకు చదువొచ్చేదికాదు. ఆమె సరస్వతిట. దొడ్లో కొమ్మని తీసుకొచ్చి, మెట్లపైన చివరి మెట్టుమీాద రవివర్మ బొమ్మలో సరస్వతిలా, కొమ్మని వీణకింద అమర్చుకుని, కళ్ళుమూసుకుని కూర్చునేది. నేను భక్తుడను, మెట్లకింద పువ్వులతో పూజించేవాణ్ణి.

'దేవీ! మీారు కనబడండి'

'భక్తా! నీవు పైకి రమ్మ.'

'అంతదూరం యీా దీనుడు రాలేడు.'

'నీ కర్మం! నేను కిందికి రాకూడదు' అనేది.

'భిక్షం పెట్టించండి' అనేవాణ్ని.

ధనంగారి వుంగరం యిచ్చినెయ్యి. తరవాత భిక్ష పెడతాను.'

'వుంగరం పోయింది,-గీదవాణ్ణి, క్షమించండి. మీారు భాగ్యవంతులు. మీాకే యిన్వండి' అన్నాను.

దొడ్లో ఎవరో పిలిచినట్లనిపించింది. సరస్వతి కొమ్మని నా నెత్తిమీద వొదిలేసి, గబగబా పారిపోయింది.

తరవాత ఐదారు నెలలవరకూ ధనం కనపడలేదు. వాళ్ళు వాళ్ళతో కలిసి ఏవూరెళ్ళిందో నాకు చెప్పలేదు. నేను ఒక్కణ్ణే ఆ మేడమెట్లమీద ఆడుకుంటూవుండేవాణ్ణి. ఇరవై మూడు మెట్లుండేవి; నాటిలో పద్ధెనిమిదింటికి పగుళ్ళుండేవి. కింద రెండింటిమీద ఏవో గడ్డిమొక్కలు కూడా మొలిచేవి; మా ఆటవల్ల అవి కాస్తా చచ్చిపొయ్యాయి.

ఒకరోజున సాయంత్రం ఆరుగంటలకి, మెట్లదగ్గర కొచ్చి కిందిమెట్టుమీద కూర్చున్నాను. మూలగా చిన్న తెల్లపువ్వు మొక్కవొకటి ఎదిగివుంది. అల్లా పైకి చూశాను. ఆఖరిమెట్టు మీద ధనం కూర్చునివుంది. నేను భయపడి, మెట్టుమీదనుంచి కిందికి జారిపోయాను. ధనం ఎదిగిపోయింది; మారిపోయింది; నేను గుర్తుపట్టలేను. చీర రవికా వేసుకుంది.

'నే వున్నానని నీ కెట్లా తెలుసు!' అంది. కంఠంకూడా మారింది. కంచువరల నూతిలోంచి వొచ్చే ధ్వనిలాగుంది. నాకు సిగ్గేసింది.

ఏమీ మాట్లాడలేదు.

'నేను రోజూ యిక్కడికి వొస్తుంటాను.'

'ఎందుకు?'

'ఏమో!'

'నేను దొంగని కాను, నీ వుంగరం నీ కిచ్చేస్తాలే.'

'అబ్బో, కోపమే! -ఓరీ దొంగా, వుంగరం దొంగిలించినందుకు రాణిగారు నిన్ను శిక్షిస్తున్నారు' అన్నది ధనం.

నేను మాట్లాడలేను. మరో రెండు మెట్లుదిగింది. నా జుట్టులోనికి చెయ్యిపోనిచ్చింది. నా వొళ్ళు కంపరం ఎత్తింది; ముట్టుకుంటే ఏమవుతుందో అని బెంగ. మందారం మొగ్గలా చిన్నినోరు; గులాబీరేకల్లాంటి చెక్కిళ్ళు; నక్షత్రం చేపలాంటి కళ్ళు. నా కేడవాలనిపించింది. ఎన్నిగాజులజతలో లెక్కపెట్ట లేను; గలగల్లాడాయి. ఏడో ఎనిమిదో వుంగరాలు. ధగధగ మెరుస్తున్నాయి. తెల్లనిప్పలా దుద్దులు. నుదుటిలోనుంచి వుద్భవించినట్టుగా ఎర్రటిబొట్టు. రంగులసువాసన నాపూపిర్ని బంధించింది. పల్చటి పసుప్పచ్చ పట్టుచీర—ఏది వొళ్లో ఏది చీరో తెలీక మతిపోయి మౌనంలోపడ్డాను నేను చూడ లేకపోయాను. నా కళ్లెందుకో తడిసినాయి. అక్కడుండలేక వెళ్ళిపొయ్యాను—' కొండయ్య కళ్ళు మూసుకున్నాడు.

'నువ్వు పిచ్చివాడవు కొండయ్యా! ఆడదాని దగ్గర నాజూకు కవిత్వం, ఏడ్పులు పనికిరావు వాళ్ళు కాఠిన్యానికి దాసులవుతారు. ఓసారి, తాశిల్దారుగారి భార్య ఏంచేసిం దంటే... వుండు, యిప్పుడు మర్చిపొయ్యాను. రాత్రి జ్ఞాపకం చెయ్యి. జ్ఞాపకంచేసుకుని చెబుతాను' అన్నాడు అధికారి.

మళ్ళీ కొండయ్య స్వగతంలా మొదలెట్టాడు.

'నేను అదిజరిగింతర్వాత, చాలారోజులవరకూ ఆ మేడ కేసి చూళ్లేకపొయ్యాను. ఆ మేడమెట్లు ఎల్లాగో వున్నాయి; నా కోర్కెలు, కలలు, ఆదర్శాలు, అన్నీ ఆ మెట్లకింద మారి పోయినట్లనిపించింది. నే నా మెట్లు ఎక్కలేను; రోజులు, వారాలు, నెలలు గడిచాయి.'

'ఓరి పిచ్చికొండయ్యా—అన్నింటిలోకి అశాశ్వతమైంది ఆడదాని అందం. అదిమాది బెదిరిపోయినవాడవు నువ్వెందుకు పనికొస్తావు? మా ఆవిడకూడా చిన్నప్పుడు చాలా అందంగా వుండేది. నాటకానికెడితే, ఆవిణ్ణిచూస్తూ, గేట్లోవాళ్ళు టిక్కెట్లు అడిగేవాళ్ళు కాదు. ఎందుకంటే? రైలు ప్రయాణంలో టికెట్ కలెక్టర్లు ఆవిణ్ణికాని, ఆవిడ పక్కనకూచున్న నన్ను కాని, టికెట్ అడగడం జరిగేదేనా. నేను అందమైనవాణ్ణనన్న సంగతి నాకు తెలుసుగనక సరిపోయిందిగాని, మరోడైతే స్కూలుపిల్లల హేళన పళ్ళేక విషం తాగి చచ్చును. అందుకనే పెద్దలు ఆలి మర్కటం అవాలని ఆశీర్వదించారు. చీకటిపడుతోంది. లే, వెడదాం—పుసుగూస్తూ వుంటుంది' అని అధికారి బండమీదనుంచి లేచి, చెయ్యి కొండయ్యకి పూర్తిగా యిచ్చి లేవదీశాడు.

తూర్పుకొండ వెనక చందమామ వెలుగులో చీకటి తెలీడంలేదు. కొండలు నీడలుగా సాగారి వెన్నెల మత్తులో వెర్రిగా పడుకున్నాయి. కాలిబాటలు దూరంగా కలిసి పోయాయి. మీగా వెన్నెలుందిగా, మా జోలెవరిక్కావా లనుకుంటూ, మేఘాలన్నీ ఎక్కడికో కదిలిపోతున్నాయి.

'కాసేపుందాం' అన్నాడు కొండయ్య బండికి జేర్లబడుతూ.

'చలిగాలి— ఎక్కువసేపు తిరిగితే, నా డాక్టర్లు చంపుతారు' అన్నాడు అధికారి; నవ్వుతూ మళ్ళీ అన్నాడు—'నా శ్రేయస్సుకోరేవాళ్లు డాక్టర్లు, లేకపోతే ఫీజు రాదుగా. లే, లే, నడుస్తూ చెప్పుకుందాం.'

అధికారి కొండయ్యారి లేవదీశాడు; ఇద్దరు ఇంటివేపు నడవడం సాగించారు.

'చెప్పు, చెప్పు తరవాతేం జరిగింది?'

'వారాలు గడిచాయి. ధనంవుంగరాన్ని, మా దొడ్లోంచి పెల్లగించి, తిరిగి యిచ్చివేద్దామని నిశ్చయించుకొన్నాను. మేడదగ్గర కెళ్ళాను. జోరెగా జనం అటూయిటూ తిరుగుతున్నారు. దొడ్డివైపు వెళ్ళాను మెట్లనీ మరమ్మతు చేశారెవరో. దొడ్లో కార్కానా; సున్నంబట్టీ, రంగులతొట్టెలు అంతాజనం. ధనాన్ని చూడాలంటే వాళ్ళుంటున్న మేడదగ్గరికి వెళ్ళాల్సిందే. ఏంచెయ్యను! వాళ్ళమేడవైపువెళ్ళాను. అరుగు పక్కన సందుంది–దానిగుండా దొడ్లోకిదోవ. అటూ యిటూ తిరుగుతున్నాను. ఎవ్వరూకనిపించరు. రోడ్డుమీద తాపీవాడు కనుపించి, 'ఆళ్ళందరూ ఎళ్ళిపొయ్యారు. యిక్కడ లేరండి' అన్నాడు.

'ఎక్కడున్నారు?'

'పోస్టాఫీసు వీధిలో యింట్లో కెళ్ళారు' అన్నాడు.

పైన గదిలో కిటికీలోంచి యెవళ్ళో చప్పట్లుకొట్టి 'ఇక్కడ', అన్నారు. కళ్ళు, నుదురు, జుట్టుమాత్రం కనిపించాయి. ధనం.

'అటు, అటు' అన్నట్టు చెయ్యి కదిపింది నేను దొడ్డివైపు వెళ్ళాను. మండువాలోంచి మేడమీదికి మెట్లున్నాయి. వెళ్ళి మెట్లకింద నుంచున్నాను. మెట్లపైన చివర ఆమె నిలబడివుంది.

'మేం నూ యింట్లో కెళ్ళిపొయ్యాం. ఇది అద్దెకిచ్చేస్తున్నాం, మేజస్ట్రేటుగారికి' అన్నది—గాజులు, వుంగరాలు, దుద్దులు, నగలు బరువుగా మోగుస్తున్నాయి. కిందికి దిగు అన్నట్లు తల పంకించాను. నన్నే పైకి రమ్మంది. ఆమె భాగ్యవంతుల పిల్లని, నేను బీదవాణ్ణనీ, మా యిద్దరికీ మధ్య ఇరవై రెండు మెట్లున్నాయనీ, అప్పుడనిపించింది నాకు. ఆ మెట్లు ఆమె దిగదు; నేను ఎక్కలేను.

'నీ వుంగరం యిచ్చేద్దామని వచ్చాను' అన్నాను.

'ఏదీ?'

'ఇదిగో'

'ఇల్లా పడెయ్యి.'

'ఒక్క మెట్టు దిగు, ఇచ్చేస్తాను.'

'నువ్వే వొక మెట్టు ఎక్కి పడెయ్యి' అన్నది.

'దిగవా?'

'కోపమా ?'

దిగింది.

'మరో మెట్టు' అన్నాను.

'నువ్వు ఎక్కరాదూ?'

ఎక్కాను.

'పడెయ్యి' అన్నది.

'అన్ని వుంగరాలున్నాయి, చాలవూ?'

'ఇచ్చేస్తా నన్నావుగా.'

'కావాలన్నావుగా.'

'కావాలంటే యిచ్చేస్తావా?'

'ఓ'

మరో మెట్టు దిగింది.

'ఏది?'

'కావాలను' అన్నాను.

మరో మెట్టు ఎక్కాడు.

'నువ్వెందుకు దిగలేవు?' అన్నాను.

అధికారి కొండయ్యని ఆపుచేసి 'మాం బాగా అడిగావు. ఆ ప్రశ్న నేను మా ఆవిణ్ని అడగలేకపోతున్నాను. ఆవిడా మెట్లు దిగదు,—పెద్దదీ అనుకో,—అయినా, మొదటినుంచీ పెద్ద అవసరం వొస్తేగాని, మాటిమాటికి మెట్లుదిగేఅలవాటు లేదు—చెప్పు చెప్పు'— అన్నాను. కొండయ్య చెప్పడం మొదలెట్టాడు.

'నువ్వెందుకు ఎక్కలేవు?' అంది.

'ఇది మీా మేడ. నువ్వే దిగాలి.'

మరొకటి దిగింది.

నేను మరొకటి ఎక్కాను.

'మా మేడైతే ఇన్ని మెట్లు ఎల్లా ఎక్కావు?' అంది ధనం.

'నీకోసం.'

'ఐతే అన్ని మెట్లూ ఎక్కిరాక నన్నెందుకు దిగమంటావు?'

'నాకోసం.'

'దిగానుగా, యింక చాలు.'

'నాకోసం కాదు, నువ్వు దిగింది' అన్నాను

'మరెందుకు?'

'నీకే తెలుసు'

అని వుంగరం పైకెత్తి చూపించాను. దాన్నలాగి కడానికి గబగబా మిగత మెట్లన్నీ దిగి నాచేతిలో వుంగరాన్ని పట్టుకోబోయింది; నేను వుంగరాన్ని పై మెట్టుమీద పడేసినట్టు గిరవాటెట్టాను. తను గబగబా మెట్లెక్కి పైకెళ్ళి వుంగరాన్ని కిందపడేటట్టు గిరవాటెట్టింది. నేనూ మెట్లుదిగి కిందికి వచ్చేసి వుంగరం తీసుకున్నాను.

'నా కక్కర్లేదు వుంగరం, నువ్వే తీసుకో — నాకు బోరెడుతున్నాయి' అన్నది ధనం.

నాకు చాలా కోపంవొచ్చింది. ఏవేవో ఆలోచనలొచ్చాయి ఉంగరం తీసుకుని, మెట్లన్నీ ఎక్కి, పైకి ఆమె దగ్గరకే వెళ్ళాను.

'తీసుకో, యిుదు' అని నేలమీద పెట్టాను.

తీసుకోబోయింది. దాన్ని చేత్తో కిందికి నెట్టేశాను. తనూ ఎగిరి మెట్లమీద జారి, కిందికి పడిపోయింది; నేను పట్టుకున్నాను. నాపట్టు తప్పించేసి, మెట్లుదిగి, వుంగరంతీసుకుంది.'

ఇంతట్లో, యిద్దరూ యింటికి చేరుకున్నారు. అధికారి ఆ కుర్చీలో వాలిపొయ్యాడు 'హాసి, ఆయన వొళ్ళోకెక్కి ఆనందంతో మూలుగుతోంది. కొండయ్య వెడతానని బైలుదేరాడు.

'కథ పూర్తికాకుండా ఎల్లా వెడతావు—ప్రొద్దున్న వెడుదువుగానిలే — ప్రొద్దున్న మా పెద్దమ్మాయికూడా

వొస్తుంది, చూసి పోమవ్వుగాని. పదిమందినూటా శోసేసి, పెళ్ళి చెయ్యకుండా చదువు చెప్పిస్తున్నాను. చూచుకో నా మజా...' అన్నాడు అధికారి గర్వంగా. కొండయ్యా వుండి పోయ్యాడు. 'తంబి' వొచ్చి పెట్రొమాక్సు లైటు వెలిగించాడు.

అధికారి, కొండయ్యా కుర్చీలు దగ్గరకులాక్కుని, చదరంగం ఆటకి కూర్చున్నారు. అధికారి మొదలాట గెల్చాడు. కొండయ్యామీద ఆయనకి స్నేహభావం ఎక్కువైంది. తనతో ఆడి వోడిపోయినవాళ్ళంటే ఆయనకి చాలా ఆదరణ. మరో ఆటకి రమ్మన్నాడు. భార్యని కేకేసి, యీ ఆట చూడమన్నాడు ఆవిడ సమాధానం యివ్వలేదు. అధికారి విసుక్కుని, మొహం చిట్లించి, 'తంబిని'చూడమన్నాడు. 'నాకు బోలెడు పనుందండి' అని లోపలికి వెళ్ళిపొయ్యాడు వాడు. 'సీకర్మం' అని, పోనీ 'హసీ' యేనా చూస్తుందిలెమ్మని సమాధానపడి ఆటకి వుపక్రమించాడు అధికారి; తను ఎల్లానూ నెగ్గుతానన్న ధీమాతో, ఆలోచించకుండా గబగబ ఎత్తులు వేస్తున్నాడు.

'ఇదిగో, కొండయ్యా! యీసారి కళ్ళజోడు తీసేసి ఆడి, నీ ఆట కట్టేస్తాను' అన్నాడు. కొండయ్యా అంగీకారం సూచిస్తూ నవ్వాడు. 'తంబి' పీటలూ అవీ వేసి, భోజనాల సన్నాహం చేస్తున్నాడు. ఆట ముగిసింది; అధికారి వోడిపొయ్యాడు. చాలా కోపంవొచ్చింది లోపల. చూడకపోవడం మంచిదనే అనుకుని తృప్తిపడ్డాడు. మేడమెట్లుండడంవల్ల

వుండే పుష్కరాలలో యిదోటి అనుకున్నాను. ఎందుకో నవ్వాడు.

'ఏం నవ్వుతున్నావు?' అన్నాను కొండయ్యని.

'ఏమీ లేదు, ఎందుకో జ్ఞాపకం లేదు......ఆఁ. ఆఁ, జ్ఞాపకం వొచ్చింది. ఆడదానికోసం మేడమెట్లు ఎక్కలేని వాడవు, నా ఆట కట్టించడం ఏమిటా అని నవ్వొచ్చింది' అన్నాడు.

కొండయ్యకూడా సమానంగా నవ్వాడు.

'ఏం! నవ్వుతున్నావు?' అన్నాడు అధికారి, భోజనానికి లేస్తూ.

'ఏమీ లేదు.'

'చెప్పు.'

'మీరు మెట్లు ఎక్కగలిగారు, కనకనే, ఆటలో ఓడిపోయ్యారేమో!' అన్నాడు కొండయ్య.

'అసాధ్యుడవే, ఏమో అనుకున్నాను ఓసారి, శ్రీరంగం వెళ్ళినప్పుడు, మీనాక్షమ్మ వొచ్చిందిలే—మీనాక్షి అంటే, మా జమీందారుగారి మనిషిలే—' అంటూ, చెప్పడం సాగించిన అధికారి భోజనానికి కూచోగానే, మీనాక్షి మాట మరచిపోయ్యాడు. ఆయన చెప్పదలుచుకున్న గాధలతో ఏ మాసపత్రికనైనా సరే, రెండేళ్ళు నడపొచ్చు. భోజనం చేసి బైటికి వెళ్ళాము. కుర్చీలలో కూచున్నారు. అధికారి చుట్టముట్టించాడు.

'కొండయ్యా, ఎక్కువ సంతోషం కలిగించే అనుభవం ఏదంటావు?' అని అడిగాను.

'ఏరకం అంటావు? భౌతికమా, మానసికమా?'

'ఏదో అంటావుగాని, రెండూ వొకటే అంటాను. మాంచి ఆకలిగా వున్నప్పుడు భోజనంచెయ్యడం భౌతిక మంటావా, మానసికమంటావా? నా కిందాక మంచి ఆక లేసింది. డాక్టర్లు ఘనపదార్థం మితంగా తినమని శాసించారు; ఆ శాసనాన్ని ధిక్కరించి బలంగా వేశాను; గొప్ప భౌతి కానందం కలిగింది—'

'డాక్టర్లని ధిక్కరించానుకదా అన్న దాంట్లో మాన సిక ఆనందం వుంది—అదే రెండింటికీ తేడా—' అన్నాడు కొండయ్య.

'నువ్వు చెప్పినదాన్నిప్రకారం, వ్యావహారికంగా మనిషి ఏది చెయ్యకూడదో అది చెయ్యడంలో మనిషికి సంతోషం వుందని తేలింది. స్త్రీ మరోడి భార్యగా వున్నప్పుడే ఆకర్షణీ యంగా వుంటుంది. తాశీల్దారుభార్యని తీసుకో—

'మా అరుణ అంతకంటే వెయ్యిరెట్లు బాగుండేది. యిప్పుడంటే వార్ధక్యంవచ్చి, నాగరికత పరిమాణం యొక్క కొలతబద్దలా తయారైందిగాని, ... ఏమిటి మోజు? ... మరోడి భార్య కావడమే. ఓసారి యేమైందంటే-' అని మరోగాధ మొదలెట్టబోయాడు అధికారి. ఈలోగా 'తంబి' వొచ్చి, 'వుదయం స్టేషన్‌కి బండి చెప్పిరావాలా' అని అడిగాడు.

'అమ్మగారేమన్నారు?'

'మిమ్మల్ని అడగమన్నారండి.'

'ఈ ఆడాళ్ళలాగేనా తెలివైనవాళ్ళు కొండయ్యా. పరాయివాడైనా యింట్లోవుంటే, వాళ్ళధోరణి వేరు.

వృత్తిపన్నాడు మొగుడి మొహాన ఏ గంజినీళ్ళు పోసినా, అతిథివా స్తే షడ్రసోపేతంగా చేస్తారు; వొంటిగా వున్నప్పుడు మొగాడి బుర్రమీద తాళంకప్ప బద్దలైనా, పరాయివాడిముందు దాసానుదాసురాలు బండి పంపించాల్సిందీ, అక్కర్లేందీ నేను నిర్ణయించాలట, చూడు చిత్రం; అందుకనే స్నేహితులో అని కొట్టుకుంటారు కుటుంబీకులు. వెళ్ళరా, వెళ్ళి మీ రెల్లాగంటే అల్లా చెయ్యమన్నారండని చెప్పి తగలేసు' అని విసుక్కున్నాడు. 'తంబి' లోపలికి చక్కాపోయ్యాడు. మళ్ళా అధికారి కేదో జ్ఞాపకం వొచ్చింది.

'ఇంతకీ, ఏది గొప్ప అనుభవమో చెప్పావు కాదు' అన్నాడు.

'నేనేం చెప్పగల్ను; నా కనుభవం తక్కువ.'

'ఉన్నదాన్లోనే ఏది మంచిదో చెప్పవయ్యా, మహా-' అన్నాడు.

'మీరు చెప్పండి.'

'కూడదన్న పని చెయ్యడంలో నువ్వు చెప్పు.'

'చెయ్యగల్గినపని చెయ్యకపోడంలో?'

'నా కెత్తిలాగుంది. చెయ్యకపోడంలో అనుభవం ఎక్కడుంది? నీది బైరాగివేదాంతం-ఐనా, నీ కేం తెలుస్తుంది పాపం!'

'అల్లా తోసెయ్యకండి మరి. చెయ్యకపోడం అంటే,- మనం ముందెప్పుడో చెయ్యగలం, చేస్తాంకదా అన్న ధీమాలో సంతోషం లేదంటారా? దాన్నే 'ఆశ' అందాం ఒకేరకమైనవి అనేకమైన ఆశలుంటే, ఆదర్శం అవుతుంది. మానవుడి జీవితమంతా ఆదర్శంకోసం కాక, మరి దేనికోసం బ్రతుకు

తున్నారంటారు! చచ్చిపోయింతర్వాతకూడా, స్వర్గానికెడతా మన్న ఆశవల్లనేగా, మన పూర్వులు రంభ, మేనక- స్వర్గాన్ని సృష్టించారు' అన్నాడు కొండయ్య నిదానంగా. అధికారి ఏ విషయంగురించీ తీవ్రంగా అట్టే ఆలోచించలేదు. ఇదంతా గందరగోళంగా కనుపించింది.

'ఇదిగో కొండయ్యా, నేను ఆరేళ్ళు పత్రికలు నడిపాను. 'ఆశ,' 'ఆదర్శం' అనే అర్థశూన్యమైన మాటలతో పాఠకలోకాన్ని దగాచేస్తూవొచ్చాను. నాదగ్గర మాటలతో గారడీచెయ్యక, బుట్టలో పాముని చూపించు. మీనాక్షిని, జమీందారు మరదలును, కావాలంటే ధనం అను-వింటాను అంతేకాని-'

వాక్యం పూర్తిచెయ్యకుండా అధికారి లేచి లోపలి కెళ్ళి, మంచంమీది దిండుని తీసుకొని కుర్చీవెనక వేసుకుని కూర్చున్నాడు.

'ఏది, యిప్పుడు చెప్పు. యిందాక ఎక్కడ వొదిలేశావో మాత్రం నన్ను అడగకు 'ఊ' కొట్టమనకు. రెండే షరతులు' అని అధికారి కళ్ళు మూసుకున్నాడు. కొండయ్య కథ చెప్పడం ప్రారంభించాడు.

'ధనం తన వుంగరాన్ని వేలుకి తగుల్చుకుని గర్వంగా చూస్తోంది. నేను బిగ్గరగా నవ్వాను. ధనం పైకిచూసింది.

'ఎందుకు నవ్వు?'

నే నేమీ సమాధానం చెప్పకుండా, వెకిలిగా నవ్వుతున్నాను.

ధనం పెదవులు చేపపిల్లల్లాగ కలా కోపంతో కదిలాయి; కనుబొమ్మలు, నృత్యానికి సిద్ధపడిన నల్లత్రాచులుమాదిరి వొంపు తిరిగాయి; చెక్కిళ్ళలోంచి రక్తం రహస్యంగా తొంగి చూసింది; ధనం నిజస్వరూపాన్ని ఆనాడు చూడగలిగాను. చటచటా మెరుస్తోంది — లోతుల్లోంచి విడిపోయి సంధ్యని తడుముకొస్తున్న వొంటికెరటంలా.

'ఎందుకు నవ్వు?'

మెట్లన్నీ ఎక్కి, పైకి నాదగ్గరికి వొచ్చేసింది... సంధ్య కోసం ఎగిరి, కొండకి తగిలి, పగిలింది కెరటం

'ఆ వుంగరం నీది కాదు' అన్నాను.

ధనం మొహం తెల్లారి వెల వెలబోయింది.

'మరెవరిది?' నీరసంగా కోడి కూసింది.

'నిది పారేశాను; ఇది మరోటి. అల్లాంటిదే కనుక్కో లేకపొయ్యావు' అన్నాను. ధనాన్ని ఏడిపించాలన్న నా సంకల్పం సిద్ధించినందుకు నేను చాలా గర్వపడ్డాను.

'ఎందుకు పారేశావు?'

'తొందరపడకు. పారెయ్యలేదు, అమ్మేశాను' అన్నాను.

చీకట్లో కాగడాలతో బంగారుగనులు త్రవ్వటానికి వెడుతున్న జనసమూహం అలజడి, ఆమె నేత్రాలలో కనిపించింది.

కోపంతో ఆమె రొమ్ములు వొణికిపోతున్నాయి. వేడి శ్వాస నా నవ్వుని బంధించింది. అరణ్యం అంటుకొని మహా వృక్షాలు కూలిపోతుంటే చూస్తున్నవాడిలా స్తంభించి పొయ్యాను.

'తీసుకో నీ వుంగరం' వేలునించి తీసేసి, నాబుజానికి తగిలేట్లుగా విసిరింది. మెట్లు దిగుతోంది.

'కోపమా?'

'... ...మరో మెట్టు దిగింది.

'నిజంగా అమ్మేశావనే?'

'... ...' మరొకటి.

"నగలన్నీ తీసేసినప్పుడు నిన్నుచూడాలనుంది" అన్నాను

'... ...' దిగుతోంది.

'నీ వుంగరం నీ కిచ్చేస్తా'.

'... ...' పూర్తిగా దిగి ధనం నడచి వెళ్ళిపోయింది. మేడమెట్లు దిగుతుండగా ధనాన్ని మళ్ళా నే నెప్పుడూ చూడలేదు.'

అధికారి కుర్చీలోంచి లేచాడు; పెద్దగా ఆవులించాడు. తంబిని కేకేసి పక్కలువెయ్యమన్నాడు. తంబి స్టేషనుకి బండి చెప్పడానికి వెళ్ళి యింకా రాలేదు.

'మీకు నిద్రొస్తోన్నట్లుంది?' అన్నాడు కొండయ్య.

'ఎల్లా కనుక్కున్నావు? నీకథలో నువ్వు చెప్పదల్చుకున్న దేమిటా అని ఆలోచిస్తున్నాను' అన్నాడు అధికారి యథాలాపంగా.

'నాకథలో చెప్పదల్చుకున్నది ఏమీ లేదు—ఎందు కంటే యిది కథగాదు—'

"ఆగు, నాకు తెలుస్తోంది. మెట్లెక్కడంలో సంతోషం ఉత్సాహం ఉంటాయి. ఎక్కింతర్వాత వెనక్కి తిరిగిచూస్తే

'వోస్ యింతేనా' అనిపిస్తుంది ఎక్కడం పురోగమనానికి చిహ్నం. దిగడం పతనానికి చిహ్నం—తీరా ఎక్కింతర్వాత ఏమీ కనబడదు—ఏమో నే చెప్పేది నాకే గందరగోళంగా వుంది ...సరేకాని, నువ్వే చెప్పు' అని మళ్ళా కుర్చీలో జారబడ్డాడు, అధికారి.

కొండయ్య మళ్లా ప్రారంభించాడు.

ధనంగారి రెండో మేడలోకి, ఎందువల్లనో రెండు నెల్ల వరకు మేజస్ట్రేటుగారు రాలేదు. ఆ రెండు నెలలూ నేను, ధనం, ఆ మెట్లమీద కల్సుకుంటూనే వున్నాం. రేపు నీ వుంగరం ఇచ్చేస్తానని మభ్యపెట్టి, రోజూ ధనాన్ని మేడ మెట్లదగ్గరికి రప్పించేవాణ్ని. నేనుచూస్తుండగానే, ధనం ఎదిగి పోయింది; మనస్సు మారిపోయింది; శరీరం కొత్తదనంతో విప్పారుకుంది. రోజురోజుకీ, వొకనగ తక్కువగా ఉండేది. నేను ధనానికి వొకచిత్రమైన ఆట నేర్పాను తను మెట్లపైన చివ్వర సింహాసనంమీద కూర్చున్న రాణీ; నేను మెట్లకింద నిలబడి ఆజ్ఞ లందుకునే వొక అల్పమానుణ్ణి. రోజురోజుకి, వొక మెట్టు పైకి ఎక్కి మాట్లాడటానికి రాణిగారు నాకు ఆజ్ఞ యిచ్చారు.

'ఏంకావాలి నీకు?' అంది రాణీగారు.

'తమ కిరీటం' అన్నాను.

జిగినీ తీసేసింది.

మరునాడు.

'ఛత్రం'

రవ్వలదుద్దులు తీసేసింది.

పదహారో తారీఖు నాటికి, నేను పదహారు మెట్లెక్కాను. ఇంక ఆమెకీ నాకూ మధ్య ఏడుమెట్లే వున్నాయి రాణీ నగలన్నీ తీసేసింది; విరాగి-శిలా తయారైంది. నేనిం కేం కోరను?

'ఏంకావాలి నీకు?' అంది రాణీ.

'మీ ప్రక్కన కూర్చోనివ్వాలి' అన్నాను.

'పైకి రా' అని ఆజ్ఞాపించింది.

'మీరు దిగిరండి.'

నవ్వింది వయ్యారంగా, రాణీ.

మా యిద్దరిమధ్యా రెండే మెట్లున్నాయి.

'ఏం కావాలి?'

'రాణీ! ఈ అల్పుడికి, అడగడానికి నోరాడడంలేదు.'

'భయంలేదు'

'నేనింక మెట్లెక్కలేను ఈ ఒక్క మెట్టూ మీరు దిగిరండి. నన్ను మీపక్కన కూర్చోనివ్వండి.'

'ఎందుకు?'

'ఆ ప్రశ్న వెయ్యగలిగిన మీకు సమాధానం తెలీకనా?' అన్నాను.

రాణీ అతి వయ్యారంగా నవ్వింది; సారళ్యంతో నావళ్ళో పడుతుందేమో నక్షత్రంలా, అని రెండుచేతులూ చాచాను. కాని, రాణి పడలేదు; పైన బల్లులు కదిలి, బూజు నా నెత్తిన పడింది.

ఇంక మా యిద్దరి మధ్యనా, వొక్క మెట్టే వుంది. ఎన్నడూ లేంది, ఆరోజు సాయంత్రం చీకటిపడేదాకా మెట్ల మీదే ఆనుకుంటున్నాం. రాణీ కళ్ళల్లో వెలుగుతప్ప అంతా

చీకటిగా వుంది. మాచుట్టూ, బోలెడు మెఱుగు పురుగులు విహారము చేస్తున్నాయి నక్షత్రాలమధ్య చందమామలా వుంది రాణీ.

'రాణీ, దిగిరావా?' అన్నా దీనంగా.

'నీ కేం కావాలి?'

'మీ రే.'

'ఆ' అని గర్జించింది

'రెండు చేతులూ జాచాను. నా తలచుట్టూ చేతులు బిగించి, అప్రయత్నంగా తనవేపు లాక్కుంది నా చేతులు ఆమెనడుంచుట్టూ పెనవేసుకున్నాయి. ఆమె చేతులు నా చేతులమీదపడి వేళ్ళని తడిమి బిగిస్తున్నాయి. వల్లో చేపలాగ ఆ పల్చటి వేళ్ళు తన్నుకున్నాయి. తీసేసి, నా మొహాన్ని ముందుకి గెంటి వేసింది. నేను చీకట్లో అటూఇటూ తడుము తాడాను ఆమె అక్కడ లేదు నా అరచేతుల్లో మెరుగు పురుగులు మండిపోయ్యాయి ...'

ఇంతట్లో 'తంబి, చక్కావచ్చాడు. మెట్లగదిలో కొండయ్యకీ, మెట్లకింద హాల్లో అధికారికీ మంచాలేశాడు. పరుపులు పరిచాడు. రగ్గులు వేశాడు. అధికారిని లేవదీశాడు. మెల్లిగా వెళ్ళి మంచంమీద పడ్డాడు. అధికారి 'రగ్గు' వొంటి మీదికి లాక్కున్నాడు; నెత్తికి మఫ్లర్ తగిల్చాడు.

'ఇదిగో కొండయ్యా, నే నిద్రపోతాననుగాని, కథ చెప్పడం మానెయ్యకేం. మర్చిపొయ్యాను. తాశిల్దారుభార్య నడుం వెడల్పు ఎంతుంటుందని నీవూహా! నాగరికతంత' అని

బిగ్గరగా నవ్వుకుని 'తంబి'ని దీపం మెట్లవెనుక మూలగా పెట్టమన్నాడు.

'ఐతే, నువ్వు సంధ్యకెరటాలు, నక్షత్రాలు, యివి లేకుండా చెప్పలేవూ కథ? అనన్నితీసేస్తే చప్పగాన తెముల్తుంది. నీకథలో ధనం తీసేసిందిగా వొస్తువులన్నీ! అబ్బో, నాజ్ఞాపక శక్తి బాగానేవుంది. మాఆవిడ అనుకున్నంతఅధ్వానంకాదు' అన్నాడు అధికారి కుడివైపు తిరిగి.

కొండయ్య మంచంమీద కూర్చున్నాడు, మెట్లకేసి చూస్తూ.

'ఏమండోయ్, మీయింట్లో మేడకి ఇరవైమూడు మెట్లున్నాయి' అన్నాడు కొండయ్య.

'అందుకా, రాగానే వాటికేసి దీక్షగా చూశావు. తెల్లార్నీ, నాజ్ఞాపకశక్తి మాఆవిడ మెచ్చుకునేటట్లు చేస్తాను. చెప్పూ-' అని అధికారి అవులించాడు.

కొండయ్య మొదలెట్టాడు:

"ఆమర్నాడు ధనం రాలేదు. వారమైంది; నెలైంది; రాలేదు. నాలుగునెలలు గడిచింతర్వాత, ధనాన్నిచూశాను. ఈలోగా మేజస్ట్రీటుగారు ఆయింట్లోకి రావడం, బదిలీ అయి వెళ్ళిపోవడం, మేడ ఖాళీఅవడం జరిగిపోయింది. అప్రయత్నంగా ఆసాయంత్రం దొడ్డివేపు వెళ్లాను. దొడ్లో తాపీవాళ్లు పనిచేస్తున్నారు. నేను మెట్లదగ్గరకి వెళ్ళి కూర్చున్నాను. వెనకటి ఆట్లన్నీ జ్ఞప్తికొచ్చాయి. ధనంగారివాళ్ళందరూ ఆ వూళ్ళోంచి ఎక్కడికో వెళ్ళిపొయ్యారని నాకు తెలుసు కాని మళ్లా వొచ్చిన విషయం తెలీదు.

ఎవరో ముసలమ్మ అల్లా నేనున్నచోటు కొచ్చింది.

"ఎవరికోసం?"

"లోపలికెందుకు? తాపీమ్రవాసి వా?"

అవుననన్నట్లు తల పంకించాను. ముసలమ్మ మెల్లిగ్గా వెళ్ళిపోయింది. ఏదో ఆలోచనలోపడ్డాను; ఎంతసేపైందో తెలీదు నాకు.

"ఎవరది?"

ఎప్పుడో స్వప్నంలో విన్నకంఠం అది. పైకిచూశాను. మెట్లపైన చివ్వర "రాణి" కనబడింది.—వొళ్ళంతా బంగారమే—వజ్రాలు ధగధగా మెరిసిపోతున్నాయి లక్ష్మి చూస్తే ఏడుస్తుందనిపించి, నా కళ్ళు తడిసినాయి.

"నువ్వా!"

ఎండలో ఇంద్రధనుస్సులా ఆమెకళ్ళు ఆశ్చర్యంతో వాలిపోయి. నగలన్నీ 'అవును' అన్నట్లు నిశ్శబ్దంగా శబ్దించాయి. చిన్న నల్లబొట్టు, దానిచుట్టూ ఎఱ్ఱబొట్టు, అసలా మొహామే, దేవకన్యకి బొట్టులాగుంది. చిన్న తెల్లపువ్వు; దానిచుట్టూ ఎఱ్ఱపువ్వులు; అసలా జడే, అప్సరస జడలో పువ్వులాగుంది.'

అధికారి, దగ్గి, కదిలాడు.

"అనే వొద్దన్నది."

కొండయ్య దీనంగా చూస్తూ, మాట వినిపించుకోకుండా చెప్పడం మొదలెట్టాడు.

"ధనం మెట్లుదిగుతుందనుకున్నాను. దిగలేదు. నేనలా నిలబడిపోయ్యాను. ధనం అటూఇటూ చూసింది. లోపలి

వెళ్ళి, గదితలుపులుమూసేసి, మళ్ళావచ్చింది పైకిరమ్మన్నట్లు తలపంకించింది. నేను గబగబ మెట్లెక్కి పైకి వెళ్ళాను. మా యిద్దరికీ మధ్య వొక్కటే మెట్టుంది.

'ఎందుకు?' అన్నాను.

'నువ్వెందుకొచ్చావ్?' అన్నది ధనం.

'నీకు తెలీదా?'

'ఏమో!'

'మరెందుకు రమ్మన్నావు?'

'నువ్వే వచ్చావు.'

'కాదు, మెట్లెక్కి.'

"నీకేం కావాలి-దబ్బున చెప్పు" అన్నది.

"అది నే నడగవలసిన ప్రశ్న" అన్నాను.

"అంటే?"

'ఆరోజున నీవుంగరం అమ్మేశానని అబద్ధమాడాను-. అమ్మలేదు. నాదగ్గరే వుంది. ఇచ్చేద్దామని వచ్చాను' అన్నాడు.

"ఏది?"

"నీ కింకా కావాలా?"

అని, వుంగరం గుప్పిట్లో వున్నట్లు గుప్పిడిబిగించి, చెయ్యి చాచాను.

"ఇయ్యి," అన్నది.

"ఆ వొక్క మెట్టూ, దిగి, తీసుకో" అన్నాను.

ఆ వొక్క మెట్టు దిగి, నా ప్రక్కన నిలబడింది ధనం

"తీసుకో" అన్నాను, గుప్పిడి చూపిస్తూ.

"ఛీ" అని గుప్పిడి విప్పబోయింది.

నేను మెట్లుదిగుతున్నాను. తనూ దిగుతోంది. అన్ని మెట్లూ దిగిపొయ్యాం. గుప్పిడివిప్పి చూపించాను. అందులో వుంగరంవుంది. ధనం దాన్ని తీసుకుని ఆనందంతో పరిశీలించింది నేను ఆమె కళ్లల్లోకి తీక్షంగా చూశాను. ఎంతో ఆశ, ఎంతో ఆకలి, ఎంతో మమకారం ఆమెకళ్ళల్లో కనిపించిన వుంగరంలో చూశాను. వాటిని ఏ మనిషీ పంచుకోలేడు. అదొక ప్రవాహం. అందులో నేనుగడ్డిపోచను; అదొకనిశీధి, నేనొక రంగుపురుగును; అదొకజ్వాల. నేను మసిని. నన్నుతోసేసింది ధనం—వుంగరం తీసుకుని గబగబా మెట్లెక్కి పైకి వెళ్ళిపోయింది.

"ధనం" అని పిలిచాను. కిందనుంచి నా కంఠం నాకే ఆశ్చర్యం కలగజేసింది.

"నేను వెళ్ళిపోనా?" అని అడిగాను.

అర్థంలేని ప్రశ్న.

ఆమె యేమీ మాట్లాడలేదు.

'నేనొకటిచెప్పనా'? అన్నాను. ప్రశ్నార్థకంగాచూసింది.

"ఆరోజు సాయంత్రం నన్నుతోసేసి వెళ్ళిపొయ్యావు. ఎందుకో యిప్పుడు తెలిసింది. నా వేళ్ళుతడిమావు, ఉంగరం కనబడలేదు పాపం. అవునా?" అన్నాను.

'కాదు' అన్నట్టుగా తలపంకించింది.

'ఇప్పుడూ తోసేసి వెళ్ళిపొయ్యావు, ఎందుకో తెలిసింది. నీ వుంగరం దొరికింది. అవునా?' అన్నాను.

పుట్టలో ఇరుక్కుపోయిన పాములా తన్నుకులాడింది. వుంగరం వేలునుంచి తటాలున తీసేసి కిందికి గిరవాటెట్టింది.

'తీసుకుపో—' అని, చరచరా వెళ్ళిపోయి, తలుపులు మూసేసుకుంది. స్వర్గం గడియలు ఎవరో వేసినట్లైంది. స్వర్గం బైటో, లోపలో మీరు నిర్ణయించాలి.'

అన్నాడు కొండయ్య. కాని అధికారి దగ్గర నుంచి సమాధానంలేదు. పెట్రోమాక్సు దీపం వొత్తి మండి కాలి పోయింది. అధికారి గుర్రుగురొంచ వినబడుతోంది సముద్రంలో తుపాను ఆకాశంలో మారుమ్రోగినట్లు. కొండయ్య కళ్ళు నులుముకొని, 'రగ్గు' ముసుగేసుకొని పడుకున్నాడు. 'హానీ' అధికారిమంచంకిందికి చేరింది "తంబి" మెట్లమీద జేర్లబడి, నిద్రలో తూలుతున్నాడు. కొండయ్య తన చిటికిన వేలికున్న వుంగరం తడిమి చూసుకున్నాడు

తెల్లవారింది. తెరలా మేడచుట్టూ మంచుఆవరించింది. కిరణాలు, వెండి బాకుల్లా తెరని ఛేదిస్తున్నాయి. అధికారి, కొండయ్య ఫలహారం కాఫీ అయ్యాక అల్లా నడిచొద్దామని బైలుదేరారు.

'ఆగు. ఇవాళ మనం బైటికి వెళ్ళలేం. మా అమ్మాయొస్తుందిగా...' అన్నాడు అధికారి. రెండుచేతులూ వేడికోసం గట్టిగా నలుపుకుంటూ.

'ఈలోగా వొక్క—చదరంగం ఆట వేద్దాం—ఉన్నమాట చెప్పేస్తాను—నీ ఆట కట్టిస్తేగాని నాకు శాంతి వుండదు. అని సకిలించి, 'తంబిని' అన్నీ సిద్ధం చెయ్యమన్నాడు. వాడు నాలుగూ అమర్చి, బండి తీసుకొని స్టేషన్‌కి వెళ్ళాడు.

'నా. కూర్చో ఇప్పుడు నెయ్యి-ఏతే - కొండయ్యా, రాత్రి నీకు బాగా నిద్రపట్టిందా? పాపం. నువ్వు కథ చెప్పు కుంటూపోతున్నావు. నేను కలలో వున్నాను-నాగులకోలది, వేలకోలది మేడమెట్లు ఎక్కేస్తున్నట్లు. తీరా మెట్లనీ ఎక్కి-చూస్తూ, కనిపించింది. 'తాళిల్లాసుపెళ్ళాంపేపు' బడాయిగా నవ్వుతున్నాడు అధికారి.

'ఇన్, గట్టిగా మాట్లాడుకున్నా వేమిటి! మా ఆవిడ వింటుందిస్మా, ఆగు, మరచిపోయ్యాను మాఆవిడచూస్తుండగా ఆడాలి ఈసారి ఆట-' అని చప్పట్లుకొట్టి భార్యని కేకేశాడు.

ఆవిడ మెట్లపై లోపల గదిలోంచి

'ఎందుకు'? అన్నది.

'ఇక్కడ అంతర్జాతీయ ఆటగాళ్ళు చదరంగం ఆడు తున్నారు-చూడ్డానికి ఇదే అఖరుశయణం. రా నాలి-నాలిట్లో సారి, రెండోసారి-పడిపోతున్నాయి, మూంచి మూంచి పంగిడీ ఎత్తులు-'

కొండయ్య అధికారి ఉత్సాహాన్ని, ఆత్రుతని చూసి బీదగా నవ్వాడు. మొదటి నాలుగైదు ఎత్తులలోనే యిద్దరి వుత్సాహం తగ్గింది

'రాకపోతే పోనీలే'- అన్నాడు ప్రపంచాన్ని సంబో ధిస్తూ, అధికారి.

కొండయ్య గుర్రం ఒకటి అదనంగా చచ్చిపోయింది. మళ్ళా అధికారి హుషారుగా వింత గర్జన-ఒచేస్తూ, ఆట సాగి స్తున్నాడు. భార్యని పిలిచాడు.

'అరుణా, కరుణ రాదా?' అన్నాడు.

అరుణ మెట్లపైని నిలబడి చూస్తోంది.

'మీరే యిల్లా రాకూడదూ?' అని మళ్ళా లోపలి కెళ్ళింది.

ఈలోగా 'హనీ' వొచ్చి బల్లకింద వృత్తిప్రస్యానికి గంతులు సాగించింది.

చదరంగంబల్ల కాళ్ళకి తన వెన్నుతో రాసింది. ఎగుడు దిగుడుకాళ్ళు కదలి, చదరంగంబల్లకదిలి, ఆట చెదిరి పోయింది. అధికారి సంతోషంతో లేచి బలాన్ని డబ్బాలో వేసి, అట్ట మడిచేసి,

'కొండయ్యా, నాతో సమంగా మెట్లెక్క గలవా?'

'ఎందుకు?'

మనం పైకి వెళ్ళి ఆడుదాం.'

అధికారికి ఆటవిషయం చాలా 'కసిగా' వుంది. భార్య చూడగా, కొండయ్యఆట కట్టాలని.

'పోనీ, ఇద్దరం మెట్లెక్కుదాం. ఎవడు ముందెక్కితే వాళ్ళు ఆటగెల్చినట్లే' అన్నాడు అధికారి

'సరే' అన్నాడు కొండయ్య.

'రెడీ-వొకటి, దో, త్రీ- అని యిద్దరు పక్కపక్కనే మెట్లెక్కడం సాగించారు. ముందు కొండయ్య ఎక్కాడు; అధికారి రెండు మెట్లు వెనకపడ్డాడు.

'ఆరి కొండయ్యా, అసాధ్యుడవే- నిజంగా నెగ్గాలను కోక- ఏదో గెస్టువి కదా అని నేనే వెనకపడ్డాను' అంటూ, అధికారి తీవ్రంగా వగర్చడం మొదలెట్టాడు.

'అక్కడికీ, మీరు గెలిస్తేనే మర్యాదగా వుంటుందని నేను మెల్లిగానే ఎక్కుతున్నాను' అన్నాడు కొండయ్య.

'నువ్వు అసాధ్యుడవు కొండయ్యా' అని అధికారి కొంటెగా కన్ను మెదిపాడు.

'ఏదీ రా–ఆటకి' అన్నాడు.

కాని. ఏంలాభం! 'బలం' "అట్టా" మెట్లకింద వొది లేసివొచ్చారు.

"నే వెళ్ళి తీసుకొస్తాలెండి" అని కొండయ్య, మెట్లు దిగి, తీసుకొచ్చాడు.

కొండయ్యకి ఆయాసం వొచ్చింది. వొగుర్పుని బల వంతంగా అణచివేసుకుంటున్నాడు. ఈలోగా అధికారి, బల్ల మీద 'బలం' పేర్చి సిద్ధంచేసి, భార్యనిపిలిచాడు. కొండయ్య వెనకాలే, గదిలో అరుణ, తలుపులు కొంచెం దగ్గరగాజార్లవేసి, కుట్టుపని చేస్తో ఆట చూస్తోంది.

తొందరలో రెండు తప్పెత్తులేశాడుఅధికారి. దాంతో రెండు బంట్లు, ఏనుగా చచ్చిపొయ్యాయి.

'ఇవాళ ఎవరి మొహం చూశాను?– ఆ, ఆ–'తంబి'గాడి మొహం' అన్నాడు అధికారి దగ్గుతూ.

'పోనీ, మళ్లా ప్రారంభిద్దామా?'

'ఆగు, ఇందాకట్నుంచీ, ఏమిట్రా మర్చిపొయ్యాను, అని ఆలోచిస్తున్నా – ఇప్పుడు జ్ఞాపకంవచ్చింది. అమ్మాయి వొస్తూంటుందీపాటికీ–నేను క్షురకర్మ చేసుకోవాలి.నువ్వూను. బ్రహ్మచారివి గనుక నీకు మరీ అవసరం. ముందు నే చేసు గొస్తాను. తరవాత, నువ్వు వెడుదువుగాని.'

లేచి, అధికారి ఎదురుగుండా గదిలోకి వెళ్ళాడు. నాలుగు నిమిషాలు గడిచింతర్వాత బైటికొచ్చి కొండయ్య ముందు వోపత్రిక పడేసి-

ఇది చదువుకుంటూండు, – నాలుగురోజులు క్రితంది, అని అధికారి లోపలి కెళ్ళి, క్షవరం మొదలెట్టాడు.

'పత్రిక పాతదైతేనేం? నన్నడిగితే. ఇంట్లో వ్యాపారం చెడిపోయినప్పుడే, రాజకీయాలలో చొరబడటం.'

కొండయ్య మెట్లు దిగాలని యత్నించాడుగాని, వోపిక లేకపోయింది. పత్రిక చదవడం మొదలెట్టాడు. గదిలో ఎవరో కదిలినట్లయింది. అరుణ లేచి, తలుపులు దగ్గరగా మూసి, మళ్ళా కుట్టు మొదలెట్టింది. కొన్ని నిమిషాలు జరిగాయి. మళ్ళా ఎవరో గదిలో కదిలినట్లయింది. అరుణ లేచింది; తలుపులు కొంచెం తెరచి హాల్లోకి చూచింది. కొండయ్యకేసి చూసింది.

పాపం, కుతురు రాకకోసం ఎదురు చూస్తోంది కాబోలు అనుకున్నాడు కొండయ్య. మళ్ళా అరుణ, తలుపులు మూసేసి, తనపని చూసుకుంటోంది.

వీధిలో జట్కాబండి నిలచిన అలజడైంది. 'తంబి' సామాన్లు వరండాలోకి జేరేశాడు. బండి వెనక్కి తిరిగింది. అధికారి కూతురు, కళ్యాణి, మెట్లగదిలోకొచ్చి, మెట్లకింద నిలబడి చూసి- 'నాన్నా' అని పిలిచింది. కళ్యాణి వయస్సు యిరవై లోపు. మెళ్ళో ముత్యాలు, పగడాలు వున్నాయి. పల్చటి, పొడుగాటి ముక్కు, నిండైన కళ్ళు, గుండ్రటి మెడ

మెట్లమీదనుంచి చూస్తున్నకొండయ్యకి, కొంచెం పొట్టి మనిషిలా కనబడింది.

కళ్యాణి 'నాన్నా' అని, పైకిచూసింది. నాన్న కాదు, ఎవరో కొత్తమనిషి. గబగబ మెట్లెక్కుతోంది కొండయ్య చివాలునలేచి, రెండు మూడు మెట్లు తొందరగా దిగి, కల్యాణికోసం చేతులుచాచాడు. కల్యాణి, సముద్రంలో పిల్ల కెరటంలా, తనవేపు కొట్టుకొస్తోంది,—ఆమెలో. 'ధనం' తళ తళలు కనిపించాయి: 'రాగి' దగ్గా రేగిపోయింది. అప్రయత్నంగా దిగిపోతున్నాడు. ఆమె, తూర్పుకి ఎగబాకిన సంధ్య చాయలా, వొచ్చేస్తోంది. ఇద్దరికీమధ్య రెండే మెట్లున్నాయి. కొండయ్యపంచ పాదంకింద పడింది; పట్టుజారి, ముందుకితూలి మెట్లమీద పడిపోయి—దొర్లి, మెట్లకింద పడిపోయ్యాడు.

కళ్యాణి దొర్లిపోతున్న ఆ వ్యక్తిని ఆపలేకపోయింది. తను 'నాన్నా' 'అమ్మా' అని కేకలేసుకుంటూ-కిందికి దిగి, కొండయ్యని లేవదీయబోయింది. స్పృహలేకుండా పడి పోయ్యాడు, కొండయ్య. 'తంబి' వొచ్చాడు; తలకిందికి దిండు తెచ్చాడు.

ఏమి టేమి టంటూ, అధికారి-మొహాన వున్న సబ్బు తుడిచేసుకుంటూ - మెట్లపైనుంచి చూసి, చేతిలో కత్తి గిరవాటెట్టి, కిందికి దిగి వొచ్చాడు. కొండయ్యనిచూచాడు. తంబిని కేకేసి బండితీసుకురమ్మన్నాడు, ఆస్పత్రికి.

కళ్యాణి దిగాలుపడి కూర్చుండిపోయింది. నాడి పరీక్ష చేసింది. లాభంలేనట్లుగా పెదవులు చప్పరించి, బిక్క మొహాం పెట్టింది.

'ఎవరు, నాన్నా?' అంది కల్యాణి.

'దౌర్భాగ్యుడు' అన్నాడధికారి.

మళ్ళా 'అదేమిటే అల్లా అంటావు. వుండు, ఎవ రినైనా పిలుచుకొస్తాను. అరుణా! యిల్లా రా. కొండయ్యని చూస్తూ, యిప్పుడే వొస్తా-' అని అధికారి, మూలనున్న కర్రతీసుకుని, బైటకి నడిచాడు.

'అమ్మా, రావే-నాకు భయంగావుంది' అందికల్యాణి

'తంబి' గ్లాసుతో నీళ్ళు తెచ్చాడు. కొండయ్యనుదుటికి మోకాలు చిప్పకీ పెద్దగాయాలు తగిలాయి. ఇంకా నెత్తురు కారడంలేదు.

అరుణ, మెట్లపైన నిలబడి, చూసింది.

కొండయ్యకళ్ళు సన్నగా తెరుచుకున్నాయి. నిశీథి తలుపులు తెరుచుకున్నట్లు- కల్యాణిమొహం నల్లగా వొంక రగా కనిపిస్తోంది. ధనం, రాణీ,సరస్వతి, అన్నీకలిసినమొహం. మెట్లపైకి చూడడానికియత్నిస్తున్నాడు. ఎన్నిమెట్లు?నాలుగు ఐదు. ఎనిమిది-ఇంకా పైకి-పది పదహారు-ఇరవై. కొండయ్య మెడపడిపోయింది. ఇరవైరెండు. అరుణపాదాలుకనిపించాయి. నిశీథితలుపులు మూసుకున్నాయి 'అయ్యో! చచ్చిపో య్యాడు- ఇంకేముంది?-' అని కల్యాణి లేచి, పిచ్చిదానిలా, బైటికి, లోపలికి తిరుగుతోంది. అరుణ గదిలోకెళ్ళిపోయింది.

'తంబి' మేడమీది కెళ్ళాడు. అరుణ వాణ్ణి పిలిచి, ఏదో చెప్పింది. వాడు, కిందికి దిగి- కొండయ్యచేతులు సవ రించి, చిటికినవేలుకున్న వుంగరాన్ని తీసేశాడు. కల్యాణి ఏమీతోచక, మెట్లెక్కి- అమ్మదగ్గర కెళ్ళింది గదిలోకి.

అరుణ కిటికీఅద్దంలోంచి ఆకాశంలోకి చూస్తోంది. అమ్మ వీరకొంగుతో కళ్ళు తుడుచుకోటం చూసింది కళ్యాణి.

'ఎందుకే అమ్మా-ఏడుస్తున్నట్లున్నావు?'

'ఏమీ లేదు.'

'ఎవరే ఆయన?'

'మీ నాన్నగారి స్నేహితుడు.

'పాపం!' అంది కల్యాణి.

వీధిలో బండి నిలిచింది.

అధికారి, కొండయ్య; మరోయిద్దరు ఆ బండిలో వెళ్ళిపోవడం చూశారు- తల్లీ, కూతురు.

అరుణ, గదిలోంచి యివతలికొచ్చి, మేడమెట్లకేసి చూసింది. లోపలికెళ్ళి, తలుపు వేసుకుంది.

కల్యాణి వెనకాలే వొచ్చింది-

'ఇదంతా నామూలాన జరిగింది' అంది! అరుణ ఏమీ మాట్లాడలేదు. కల్యాణిమూలాన జరిగిందో, కల్యాణి కోసం జరిగిందో-అమెకే తెలియాలి.





## బుచ్చిబాబు

[శివరాజు వెంకట సుబ్బారావు]

జననం : ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా.

ఎం. ఏ.. మదరాసు, నాగపూరు విశ్వవిద్యాలయాల్లో.

**1943-1945** అనంతపురం, విశాఖపట్నం కళాశాలల్లో ఆంగ్లోపాధ్యాయుడుగా.

**1955** నుండి ఆలిండియా రేడియోలో.

అచ్చుపడిన రచనలు - కథలు : ఐదుకథలు, ఆశాప్రియ, ఆమెనీడ, దేశం నాకిచ్చిన సందేశం, నిరంతరత్రయం, చైతన్యస్రవంతి, నా గాజుమేడ, కాలచక్రం నిలిచింది, జ్ఞాననేత్రం, ఎల్లోరా, కలలో జారిన కన్నీరు, మూడుకోతులు.

నాటికలు : ఆత్మవంచన, దారినిపొయ్యే దానయ్య, ఉత్తమా యిల్లాలు, అద్యంతాలు.

నవల : చివరకు మిగిలేది.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada - 2.